Regd. No. M. 3824

# నవశక్తి

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారపత్రిక

సంపుటం 2 | బుధవారం 26-4-39 బెజవాడ | సంచిక 19



కాంగ్రెసులో ఐక్యత కాపాడ డానికి, బోసు—గాంధీలమధ్య సామరస్యం కుదర్చడానికి ఆతుర పడుతూన్న నెహ్రూ.

24 పేజీలు ⁂ అణా



# నవశక్తి

## పార్టీ సభ్యులు ముఖ్యంగా గమనించాలి

| | ఏప్రిల్ నెల కోటా | మూడు వారములలో చేర్పించినది. |
|---|---|---|
| విశాఖపట్టణం | 10 | 0 |
| తూ. గోదావరి | 30 | 4 |
| ప. గోదావరి | 30 | 3 |
| కృష్ణా జిల్లా | 50 | 13 |
| గుంటూరు | 30 | 10 |
| నెల్లూరు | 25 | 6 |
| రాయలసీమ | 10 | 5 |
| చిత్తూరు | 5 | 3 |
| కర్నూలు | 5 | 0 |
| ఇతర స్థలాలు | 15 | 3 |
| | 200 | 47 |

* * *

## ఏజెంట్లు గమనించాలి

1. అమ్మిన ప్రతి కాపీకి [illegible] కమీషను ఇవ్వబడును.
2. ఏజెంట్లుకు పంపిన కాపీలలో 10% (నూటికి పది) [illegible] కాపీలు తిరిగి తీసుకొనబడును.
3. ప్రతి నెల బిల్లులు, మరునాటి నెల 15 వ తారీఖు లోపల చెల్లించవలయును.
   ఉదా:—ఏప్రిల్ నెల బిల్లు మే 15 వ తారీఖులోపల చెల్లించవలయును.
4. అట్లు చెల్లించని [illegible] పత్రిక [illegible] పంపబడదు.
5. ఏ ఏజెంటుకైనను 10 కాపీలకు [illegible] పంపబడదు.

—మేనేజరు.

* *

## చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 3—0—0 |
| అర్ధ సంవత్సర చందా | 1—10—0 |
| విడిప్రతి | 0—1—0 |

విదేశ రేట్లు

| | |
|---|---|
| సంవత్సర చందా | రు 5—0—0 |
| విడి ప్రతి | 0—1—6 |

* * *

## ప్రకటన రేట్లు

"కాలం" వెడల్పు 2" (2 అంగుళాలు)

| | | |
|---|---|---|
| 20 అం॥ లోపల ప్రతి అంగుళానికి | రూ. | 0—6—0 |
| 20" అం॥ పైన | ,, | 0—4—0 |
| 100" అం॥ పైన | ,, | 0—3—0 |
| పేజీ | రు 10—0—0 లు | |
| ½ పేజీ | 6—0—0 లు | |
| ¼ పేజీ | 3—0—0 లు | |

పరి:—ఈ రేట్లుపైన కమిషనులు, డిస్కౌంటులు ఇవ్వబడవు. రు 6—8—0 లకు తక్కువ ప్రకటనలు తీసుకొనబడవు. వెంటగు డబ్బు ముందుగా ఇవ్వవలెను.

ప్రత్యేక చోటునకు, ప్రత్యేక రేట్లు.

# నెల్లూరు జిల్లాలో రాజకీయ ప్రచారం

## ఆత్మకూరు తాలూకా

### పల్లెలలోని దుర్భర పరిస్థితులు

కామ్రేడ్ ఓ. సి. కొండయ్య రిపోర్టు:—

నేను కామ్రేడ్ సుందరరాజన్‌గారు, 13వ తేదీ బయలుదేరి సంగం, వాసిలి, ఆత్మకూరు, రాజోలు, [illegible], మహిమలూరు, రామస్వామిపల్లె, బట్టుపల్లె, కాంసాపేట, చెప్పు పల్లె గ్రామాలలో 19 వ తేదీవరకూ బహిరంగ సభలు జరుపుతూ మైదాను సమ్మర్‌స్కూలు విషయములనుగూడా తెల్పేము. మేము తిరిగిన పల్లెలలో కొన్ని పల్లెల దుర్భర పరిస్థితులు యిందు తెలియచేస్తున్నాము.

16 వ తేదీ రాత్రి రాజవోలు గ్రామంలో ఒక బహిరంగసభ జరిపితిమి. మీటింగు అయిన తరువాత ప్రజలను కొన్ని ప్రశ్నలడిగితిమి. ప్రశ్నలకు జవాబుగా [illegible] రైతులు తెల్పిన విషయములు: యీ గ్రామానికి మెట్టు ఒక ఫర్లాంగు మాత్రములోపల ఫారెస్టు రిజర్వు [illegible]. యిందువల్ల యీ గ్రామస్థుల కష్టము [illegible] కాదు. పశువులను వదలగానే మెట్టు ఫర్లాంగు మాత్రములో రిజర్వు వుండడమువల్ల రిజర్వులో బొంకడం, రిజర్వువారు బందెలదొడ్డికి తోలడం తరుచు జరుగుతూవుంది. యీ విధముగా సంవత్సరానికి సుమారు బందెరుసుం పశువు ఒక్కింటికి జాస్తి అయిపోతూవుంది. యిందువల్ల రైతు జీవనం దుర్భరమై రోజుకు రోజుకు పశువులనే అమ్ముకొనవలసిన పరిస్థితి యేర్పడుచున్నది. అదిగాక ఈగ్రామ చెరువు యేలాంటి నీటి సదుపాయమునకై వాగు లేనందున మెట్ల 3 సంవత్సరముల కొరనాతి కూడా పండుట [illegible]. [illegible] యీ పూరులోవున్న [illegible] బాధ జాస్తియుంది. యీ విషయాలన్ని పోయిన సంవత్సరం ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం ఈ తాలూకాకు వచ్చినప్పుడు వారికి విన్నవించుకొని కూడా వున్నారట.

18 వ తేదీ మధ్యాహ్నం బట్టుపల్లె చేరాము. యీ గ్రామంలో మంచినీళ్ళకు ప్రజలు చాలా ఇక్కట్లు పడుచున్నారు. వూరి సమీపంలో ఒక చిన్న వాగుంది. అందులో గుంటలుత్రవ్వి నీళ్ళు తెచ్చుకొంటారు. వెండాకాలం వాగులో నీళ్ళు [illegible] కాబట్టి యేవూరికైనా మంచినీళ్ళకు పోవాలసిందే. యీ వూరికి కూడా ఫారెస్టుంది. కాని 4 మైళ్ళుగా ఫారెస్టుచేతను పశువులకు దాటలేదు. ఆఫారెస్టు ముందువుండిన [illegible] రైతుల భూములు, భూస్వాము [illegible] కొని [illegible] పోను వారిలేదని యీవూరి రైతుల బాధపడుచున్నారు. యీ వూరిలో ఒక్కడైనా చదువుకొన్నవాడు లేడు. అసలు చదువంటే ఏమిటో, స్కూలంటే యేమిటో యీ రైతులకు తెలియదు.

రాత్రి కాంసాపేట చేరాము. మేము యీ గ్రామంలోకి పోతుండగనే మా సిక్కట్లుచూచి పోలీసులని మాకు చేతులెత్తి రైతులు నమస్కరించి, అయ్యా. మీకు పాలుకావలెనా, కోడిగుడ్లు కావలెనా, అంటూ ఆదరించిరి మాకు ఆశ్చర్యమై యేమండీ మేము పోలీసులముకాదు కాంగ్రెసువారము. అవన్నీ మాకొద్దు మీరు యీవిధంగా పోలీసులకు యెందుకు కివ్వడము అని అడిగాము. మేముగనుక లంచాలు, కోళ్లు, పాలు, కట్టెలూ సప్లయి చెయ్యకపోతే మమ్ముల్ను సి. టీ. ఆక్టులో చేరుస్తారటండీ! లేనిపోని కేసులు పెట్టుతారండి. అదిగాక పోలీసువారి సహాయంతో కొన్ని దొంగతనాలు కూడా జరుగుతాయండి, అంటూ యింకా వ్రాయ వీలులేని విషయములు కొన్ని చెప్పేరు. మీటింగు అయిన తర్వాత అవూరి యిబ్బందులు రైతులు యీ విధముగా మొర పెట్టుకొన్నారు. యీ వూరికి కూడా మంచినీళ్ళ భావిలేక కాలువల్లో గుంటలుత్రవ్వి నీళ్ళు తెచ్చుకొంటు న్నారు. ఫారెస్టువల్ల దిన దినానికి పశువుల అమ్ముకొనవలసివస్తుంది. ఈ గ్రామానికి ఒక చెరువు వుంటే అది 5 యేండ్లకుకూడా నిండదు. అందువల్ల పొలాలు మాగానికూడ బీడుఅయి పోతుంది. అయినా పన్నులు వసూలుమాత్రం తప్పదు. యీ సంవత్సరంకూడా పైర్లు దొందు పోతే రైతులు అర్జీపెట్టుకున్నారు. సగం సిస్తు రిమిషను యిచ్చారని తెలిసిందిట. కాని సింమ పన్నే వసూలుచేస్తున్నారు. యీవూరులోకూడ అక్షరాభ్యాసమైనవారు లేనేలేరు.

యీవిధంగా పల్లెలన్నిటిలో దరిద్రము తాండవమాడుతున్నది. యిందుకులోను ఆఫీసర్ల లంచాలు. పోలీసుల దొంగకేసులు బాధరోజురోజుకు విపరీతమౌతూంది. జిల్లాబోర్డువారు యేరోజుల్లో వేసేరోకాని రోడ్లు రిపేర్లులేక నాశనమైపోతున్నవి. యీ పరిస్థితులు జిల్లా కాంగ్రెసువారుచూచి నివారణోపాయానికి ప్రయత్నించాలి.

## కోవూరు తాలూకా

### 10 వ తేది

బి. శేషయ్య. (కోవూరు తాలూకా రైతు సంఘాధ్యక్షుడు) యస్. శంకరయ్య. (కోవూరు తాలూకా రైతు సంఘ కార్యదర్శి) డి. అక్కయ్యగారలు అల్లూరు నుండి బయలుదేరి సాయంత్రము యిసకపల్లి చేరిరి. సాయంత్రం 7 గంటలకు కొంత రైతుపాటలతో గ్రామమంతయు తిరిగి గ్రామ చావడివద్ద మీటింగు జరిపిరి. 50 మంది వచ్చిరి. బి. శేషయ్యగారు ఫెడరేషను-ప్రజల కర్తవ్యము అను దానిమీద ఉపన్యసించిరి. యస్. శంకరయ్యగారు కాంగ్రెసు ప్రజలకొరకు ఏ విధముగా పనిచేసేది నేషనల్ డిమాండును విశదీకరించుటయు జరిగిన మీద కొంతమంది ఓట్ల సమయమునచేసిన వాగ్దానమును కాంగ్రెసువారు నెరవేర్చలేదనియు ప్రశ్నించిరి. దానికి బి. శేషయ్యగారు తగు విధముగా జవాబుచెప్పి అందరును కాంగ్రెసులోచేరి మన కేమి కావలెనో మన సంఘాలద్వారా ఒత్తిడి చేసిన మన కోర్కెలు నెరవేరుననిచెప్పిరి.

### 11 వ తేది

ఉదయము 7 గంటలకు కోనాడ్డిసుంటచేరిరి. అప్పట కూలీలే 40 మంది సభకు వచ్చిరి. బి. శేషయ్యగారు కూలీల కష్టాలనుగురించి, కూలీ సంఘావశ్యకతనుగురించి ఫెడరేషనును ఎందుకు వ్యతిరేకించాలో చెప్పి సభను ముగించిరి.

తర్వాత 9 గంటలకు గోగునపల్లి చేరిరి. చెట్టుక్రింద 100 మంది సమావేశమైరి. ఈ క్రింది విషయమై చర్చ జరిపిరి. వుప్పును తయారు చేసుకొనుటకు అందరూ కలసి ఒకే పద్ధతిని తయారు చేసుకొనవలయునని బి. శేషయ్యగారు చెప్పిరి. ఈ విషయమై 4 గంటలసేపు చర్చ జరిగింది. కాని అందరూ ఒకే నిర్ణయమునకు రాలేదు. మధ్యాహ్నము 1 గంటకు సభ ముగించిరి.

సాయంత్రము రామతీర్థము చేరితిమి. 50 మందితో కలసి రైతుపాటలు పాడుకుంటూ ఊరంతా తిరిగితిమి. ఆఖరుకు 200 మంది వచ్చిరి. దామినేని అక్కయ్యగారు విప్లవ గీతాలు పాడిన మీదట యస్. శంకరయ్య కాంగ్రెసునుగురించి. నూతన రాజ్యాంగమును గురించి చెప్పారు. తర్వాత బి. శేషయ్యగారు కూలీ రైతుల ఐక్యతావశ్యకతను గురించి వుభయులు కాంగ్రెసులో చేరి కాంగ్రెసును ఏ విధముగ బలపరచవలసినది కాంగ్రెసు మంత్రులు యింతవరకు చేసిన మేళ్ళనుగురించి, చేయివలసిన పనులగురించి రైతు-కూలీ సంఘాల ఆవశ్యకతను గురించి 2 గంటలకాలము దీర్ఘంగా ఉపన్యసించిరి. సభ రాత్రి 10½ లకు ముగిసినది.

### 12 వ తేది

ఉదయము దండిపుంట చేరిరి. ముందుగా దంటోరా వేయించినప్పటికీ పనివేళ అయినందున ప్రజలు రానందున సభ జరుగలేదు.

సాయంత్రము యిందుపూరులో ద్వితీయ గ్రామ రైతు మహాసభ జరుగగా అందులో పాల్గొనిరి.

బి. శంకరయ్యగారితో సహా దళము మోపూరు గ్రామమునకు వెళ్ళినది. మోపూరులో అంతకు 10 రోజుల క్రిందట దేవిరెడ్డి రాఘవరెడ్డిగారు, బద్దిపూడి రాఘవయ్య అనే చెప్పుకుట్టేవానిని రాత్రి 10 గంటల కాలమప్పుడు యింటికి పిలిపించి చెప్పుతో కొట్టుటయు యింకను తన సేద్యగాండ్లచేత కొట్టించినందున (అంతకు పూర్వము దేవిరెడ్డి రాఘవరెడ్డిగారి సేద్యగానికి బద్దిపూడి వెంకయ్య అల్లునకు తకరారు జరిగియుండెనట.) వారువచ్చి పైఅన్యాయమునుచెప్పుకొనిరి. తరువాత గ్రామమంతయు కూలీరైతు పాటలతోను నినాదాలతోను తిరిగి గ్రామ మధ్యమున మీటింగుపెట్టగా 100 మందికి పైగా కూలీలను కొంతమంది రైతులును వచ్చిరి, నేషనల్ డిమాండు తీర్మానమును గురించి ఉపన్యసించినపిమ్మట రాఘవరెడ్డి వెంకయ్యను కొట్టుట అక్రమమనే తీర్మానము ఏకగ్రీవముగా అంగీకరింపబడింది.

### 13 వ తేదీ

అల్లూరులో బస్సు స్టాండువద్ద ఒక మీటింగును, బలిజపాలెంలో మరియొక మీటింగును జరిపిరి. రెండు సభలలోను యుద్ధమువచ్చిన పండిత జవహరులాలు చెప్పినట్లు పన్నుల నిరాకరణము మొదలగునవిచేసి స్వాతంత్ర్యమును పొందుటకు యిప్పటినుండి తీవ్రప్రయత్నము చేసి మన బలమును పెంపొందించుకొనవలయుననియూ అందుకుగాను కాంగ్రెసులో ఐకమత్యము కుదరవలెననియు ఉపన్యసించిరి.

సంపుటం 2 నవశక్తి బుధవారం

సంచిక 19 26-4-39

సంపాదకవర్గం: మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు). కంభంపాటి సత్యనారాయణ. పుచ్చలపల్లి సుందరయ్య. తుమ్మల వెంకట రామయ్య.

# పన్నుల విధానం ఎలా వుండాలి?

కాంగ్రెసు మంత్రివర్గాలు ఈ సంవత్సరము క్రొత్త పన్నులు వేశారు. వేస్తున్నారుకూడ. మద్యపాన నిషేధము, పన్నుల రిమిషను, ఇట్టి ప్రజోపకరములగు ఇతర పనులకు డబ్బుకావలసి వస్తూ ఉంది. అందుచే క్రొత్త పన్నులు వేయవలసిన అవసరము వచ్చిందని సమాధానం చెప్పవచ్చు.

విద్యుచ్ఛక్తిమీద. పెట్రోలుమీద, పన్నులు ప్రజలలో ఎక్కువమందికి. ముఖ్యంగా బీదలకు సంబంధించినవికావు. ఇవి ధనికులమీద బడుటచే, పన్నుభారం బీదలనుండి ధనికులపై వేయడానికి ప్రధమ ప్రయత్నాలుగా వీనిని బలపరుస్తాము కూడ.

కాని వినోదాలపై పన్నులో రెండణాలకు లోపు టిక్కెట్లకుకూడ పన్ను వేయడము; పొగాకుమీద, సర్వసాధారణంగా వస్తువుల అమ్మకముమీద పన్నులు వేయడం; ప్రజా సామాన్యాన్ని కలవరపెట్టుతూ ఉన్నాయి. అందులో ముఖ్యంగా పొగాకుమీద, వస్తువుల అమ్మకంమీద పన్నులకు వ్యతిరేకంగా అందోళన హర్తాళలు విపరీతముగా సాగుతూ ఉన్నాయి.

ఈ మూడింటిపై వేసిన పన్నులు బీదలనుండి తొలగించి ధనికులపై పన్ను భారము వేయాలన్న సూత్రానికే విరుద్ధంగా ఉన్నాయి. బంగారము, వెండి, అమ్మకముపై పన్నులేకుండ జేయడము. వాటాలు, సెక్యూరిటీలు స్టాక్సు అమ్మకముపై పన్నువేయక పోవడము. దీనిని స్పష్టము చేస్తున్నాయి. అంతేగాక ధనవంతులపై బడు విద్యుచ్ఛక్తి, పెట్రోలుమీద పన్నులవల్ల 15 లక్షలు వస్తే, పొగాకు పన్నుల వలన ఒక కోటి రూపాయలు, అమ్మకాల పన్నులవలన ఐదు కోట్ల రూపాయలు వస్తూ ఉంది. ఈ ఆరు కోట్లలో కనీసము బీద ప్రజాసామాన్యము 3 కోట్లయినా చెల్లించుకోవలసి యుంటుందంటే అతిశయోక్తి ఏమీకాదు.

అయితే పన్నులు వేయక కాంగ్రెసు మంత్రివర్గాలు ప్రజోపకరములగు పనులు మానుకోవలసిందేనా? తమ ఎన్నికల వాగ్దానాలను ఎలా అమలు జరపడము? పన్నులు వేసే విధానము మరియొకటి ఉందని మామనవి.

ఇండియా ఆక్టుప్రకారమే వ్యవసాయము మీద వచ్చు ఆదాయాలపై పన్ను వేయవచ్చు. బీహారు, అస్సాములలో కొద్దిగా ఇట్టి ఆదాయపుపన్ను వేశారు. ఈరాష్ట్రములో అదీలేదు. ఎక్కువ ఆదాయాలు జమీందారులు పొందుతూ ఉన్నప్పుడు వానిపై ఎక్కువగా పన్నువేయవలసినదే.

ప్రభుత్వోద్యోగుల జీతాలు, ముఖ్యంగా విదేశీయుల జీతాలు. పైఉద్యోగస్థుల జీతాలు అలవెన్సులు, చాల ఎక్కువగా ఉన్నాయి. వానిని తగ్గించాలి. కాని ఇండియా ఆక్టుప్రకారము ఇంగ్లండులోని ఇండియా సెక్రటరీ అడ్డము వస్తాడు. అయితే. యు. పి. లో లాగ ఎంప్లాయిమెంటు పన్ను ఇట్టి ఉద్యోగస్థులమీద వేయవలవలసినది.

ఇండియా అక్టుప్రకారము ఆదాయ పన్నులో కొంతభాగము రాష్ట్రాలకు ఇవ్వవలసి ఉంది కొన్ని సంవత్సరాలయిన పిదప పూర్తిగ ఇవ్వవలసి ఉంటుంది. రాష్ట్రప్రభుత్వాలు వెంటనే ఇన్కంటాక్సు అంతా తమకు ఇవ్వమని అడుగవలసినది. లేదా, 1000 రూ. ల ఆదాయము వచ్చు వారిపైకూడ ఆదాయపు పన్ను విధించడము వల్లగాని, ఆదాయపు పన్ను రేటులను వృద్ధిక్రమానుసారంగా హెచ్చించడము వల్లగాని, రాబడిని హెచ్చించుకొని దానినంతటిని రాష్ట్రప్రభుత్వాలకు వెంటనే ఇమ్మని కోరి ఉండాల్సింది.

వారసత్వపు పన్నులు, ధనికులపై ఎక్కువగా విధించమని, బాధ్యతాయుత ప్రభుత్వము కేంద్రములో ఉంటే ఏరీతిగా ఆపన్నును విధించి వసూలుచేసి తమకు ఇవ్వవలసినదిగా ఇండియా ఆక్టుప్రకారమే రాష్ట్ర ప్రభుత్వాలు కోరియుండునో అట్లే ఇప్పుడూ కోరి యుండాలసినది. కాని, వానిని విధించడానికి ఈమధ్య రాష్ట్ర ప్రభుత్వాలు చేసినట్లు అయిష్టత తెల్పి ఉండరాదు.

ఈ సూచనల నన్నింటిని, ఇట్టివి వెంటనే ఇండియా ప్రభుత్వము అంగీకరించదు! అప్పుడో?

ప్రజోపకరములగు పనులకు, ఈ క్రొత్తపన్నులు కల్గించే భారాని కన్న ఎక్కువ భారాన్ని కూడ ప్రజాసామాన్యము వహించవలసి వస్తుంది. కాని బ్రిటిషు ప్రభుత్వము మనలను బానిసలుగా అణచి పెట్టడానికి సైన్యపు ఖర్చులను యధావిధిగా పెట్టుతూ ఉంటే; దేశాన్నుండి పెన్షనులుక్రిందను. మనలను బానిసలనుగా చేయడానికి చేసిన యుద్ధాలకయిన అప్పులమీద వడ్డీలగాను కోట్లకొలది ద్రవ్యాన్ని ప్రతిసంవత్సరమూ దోచుకుపోతూ ఉంటే; ఇచ్చట మన పరిశ్రమలను, వర్తకాన్ని అభివృద్ధి చెందనివ్వకుండా అడ్డుపడుతూ ఉంటే; మన స్వాతంత్ర్యపోరాటానికి మన అభివృద్ధికి నిరోధకులగు జమీందారీల, స్వదేశ సంస్థానాధీశుల లాభాల జోలికి మనలను పోకుండ జేస్తూ ఉన్నప్పుడూ; ఇది అంతా కేవలము సైనికబలముతో చేస్తూ ఉన్నప్పుడు; అట్టి ప్రభుత్వానికి కావలసిన ధనాన్ని మనము మామూలుగనే చెల్లిస్తూ, ప్రజోపకరములగు పనులకు కొత్త పన్నులు చెల్లించుకోవడము అసంభవము. ఒకవైపు ధనము దుర్వినియోగ మవుతూ ఉంది. దానిని చూస్తూ క్రొత్తగా ధనాన్ని ఎవరిస్తారు? దుర్వినియోగాన్ని ఆపుచేయాలి. ఆడబ్బుతో ప్రజోపకరములగు పనులు చేయడానికి మొదలు పెట్టాలి. అప్పుడూ చాలకపోతే, క్రొత్త పన్నులతో ముందుకు రావాలి.

గాంధిజీ మద్యపాననిషేధ కార్యక్రమాన్ని మూడేండ్లలో అమలు పెట్టాలన్నప్పుడు, ఆర్థిక విషమ దశ వస్తుందని ఇతరులు తెలియజేశారు. సైనిక ఖర్చు తగ్గించుకొని, ఆ డబ్బును రాష్ట్ర ప్రభుత్వాలకు ఇవ్వవలసినదిగా కోరుతాము. ఇవ్వనిచో బ్రిటిషు ప్రభుత్వముతో ఢీ కొంటాము అని సెలవిచ్చాడు!

మద్యపాన నిషేధములాంటి ప్రజోపకరములగు కార్యాలకు డబ్బు కావాలి. ఆ డబ్బుకోసం ఇండియా ప్రభుత్వముతో పోరాడుతాము. అంతేకాని ఇండియా ప్రభుత్వము ఇవ్వనిచో ప్రజలపై, ముఖ్యంగా బీద ప్రజలపై క్రొత్త పన్నులు వేసయినా, ప్రభుత్వమును సాగించ బూనుకొనడము, సాగించాలని అనుకోవడము కూడ మన కర్తవ్యాన్ని మరచిపోవడమే అవుతుంది.

ఏలనన, మంత్రిపదవు లంగీకరించడము, ఎట్టి పరిస్థితులలోనైనా, ఎంత ఛండాలపు రాజ్యాంగ ప్రణాళికనైనా మనము నిర్వహించ గల్గుదుమని, ప్రభుత్వము సాగించ గల్గుదుమని రుజువు చేయుటకుకాదు. ఇండియా ఆక్టులో ఇచ్చిన అధికారాలను ఉపయోగించి బ్రిటిషు ప్రభుత్వాన్ని ఎదుర్కొవడానికి; ప్రజలకు చేయగల్గిన స్వల్ప మేలుచేసి, ఇంతకన్న ఎక్కువ కావాలంటే ఇండియా ఆక్టును భగ్నము కావించాలనీ, కాన్స్టిట్యుయంటు అస్సెంబ్లీ ద్వారా క్రొత్త రాజ్యాంగాన్ని ఏర్పరచుకోవాలనీ ప్రజలకు తెలియజేయడానికే మంత్రిపదవు లంగీకరించింది.

"మద్యపాన నిషేధ కార్యక్రమాని కోసం ఇండియా ప్రభుత్వం డబ్బు ఇవ్వనప్పుడు, నిరాశతో చేతులు నులుముకుంటూ బయటకు రావడమా? కాదు. ఈ క్రొత్త పన్నులవలన ఆ సమస్యను పరిష్కరించాల"ని రాజాజీ అనడము సరికాదు. ఇదివరకే పన్నుల భారముక్రింద క్రుంగిపోతూ ఉన్న భారతీయ ప్రజాసామాన్యంపై ఇండియా ఆక్టు ఫలితంగా క్రొత్త పన్నులు వేయవలసి వచ్చిందంటే, త్రిపురి కాంగ్రెసు చేసిన. "రాష్ట్రీయ స్వపరిపాలనలో చేయగలిగిన మేలు త్వరలో పూర్తి కావస్తుంద"న్న హెచ్చరిక నిజమయింది. అందుచే త్రిపురి కాంగ్రెసు సూచించినట్లు స్వాతంత్ర్య పోరాటానికి తగిన ప్రయత్నాలు కాంగ్రెసు మంత్రివర్గాలు చేయాలి. కాని ఇలాంటి పన్నులు జన సామాన్యంపైనా, ముఖ్యంగా చిన్న దుకాణదారులు, బీదలపైనా వేయడము, వారిలో అసంతృప్తిని కలిస్తుంది. ఇది వారిని స్వాతంత్ర్య పోరాటమునకు సన్నిద్ధము చేయడము కాజాలదు.

ఇప్పటికైనా, అమ్మకపు పన్నును ధనవంతులుపయోగించే వస్తువులపైననే ఉంచి మిగిలిన వస్తువులపై లేకుండ చేస్తారని ఆశిస్తున్నాం.

# వివిధ రాజకీయాలు

**ఒరిస్సా విద్యార్థుల సమ్మె**

ఈ నెల 20 వ తేదీ నుండి ఒరిస్సా మెడికల్ స్కూలు (కట్టక్) విద్యార్థులు గవర్నమెంటు సెక్రటేరియట్ యెదుట సత్యాగ్రహం ప్రారంభించారు. ఇంతవరకూ 89 గురు విద్యార్థుల్ని పోలీసులు ఎరస్టు చేశారు. కొందరికి ఆరేసివారాల చొప్పున కఠిన శిక్ష కూడా విధించబడింది. ఎరస్టుచేయబడిన వారిలో ఒరిస్సా రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడైన నీలకంఠ దాసుగారి కుమారుడు అశోకదాస్ అనే విద్యార్థికూడా ఉన్నాడు.

మెడికల్ విద్యార్థులు ప్రారంభించిన యీ సత్యాగ్రహానికి ప్రధాన కారణం, 5 గురు విద్యార్థులను మెడికల్ స్కూలు అధికారులు బయటికి వెళ్ళగొట్టడము. విద్యార్థుల కనీసపు కోర్కెలను నెరవేర్చడానికి ఆందోళన సల్పి, సమ్మె యేర్పాట్లు గావించడానికి నియమించబడిన కార్య సంఘములో వీరైదుగురూ సభ్యులు. విద్యార్థుల కోర్కెలను గురించి విచారించడానికి కాంగ్రెసు ప్రభుత్వం ఒక విచారణ కర్తను నియమించింది. అతడు విచారణచేసి, విద్యార్థులే డిసిప్లిన్‌కు వ్యతిరేకముగా ప్రవర్తించారని అభిప్రాయ మిచ్చాడు. యీ రిపోర్టు మెడికల్ స్కూలు అధికార్లకు బలం యిచ్చినది. వెంటనే పై అయిదుగురినీ వెళ్ళగొట్టడము జరిగింది.

ఒరిస్సారాష్ట్ర కాంగ్రెస్‌కమిటీ సమావేశమై. విద్యార్థుల సత్యాగ్రహపోరాటాన్ని గురించి చర్చించిందిగాని ఏవిధంగా శాంతి వాతావరణాన్ని కలుగ చేయాలో సూచన చేయలేదు. ఈలోగా అరెస్టులు, శిక్షలు జరుగుతూనే ఉన్నాయి.

**సత్యమూర్తి వాచాలత**

సోషలిస్టులన్నా, రైతు సంఘాలన్నా, సత్యమూర్తికి ద్వేషమని చెప్పాలి, కాంగ్రెస్‌సంస్థ ఉన్నప్పుడు యిక సోషలిస్టు పార్టీలు, రైతుసంఘాలు, ఎందుకని ప్రశ్నించాడు మొన్న బొంబాయిలో జరిగిన బహిరంగసభలో. హరిపుర కాంగ్రెసు తీర్మానంలో రైతుసంఘాల నేర్పరచుకొనే హక్కు రైతుల కివ్వబడింది. ఇక కాంగ్రెసు సోషలిస్టుపార్టీ విషయం. ఈపార్టీ కాంగ్రెసుకు వ్యతిరేకం అని ఏ కాంగ్రెసూ యింతవరకు తీర్మానించి యుండలేదు. కాని సత్యమూర్తికి మాత్రం సోషలిస్టు పార్టీ, రైతుసంఘం, కాంగ్రెసు సంస్థకు వ్యతిరేకంగా కనబడుతున్నాయి. కాంగ్రెసులో సభ్యుడుగా ఉన్న ఏవ్యక్తి ఏయితర రాజకీయ సంస్థలోను సభ్యుడుగా ఉండకూడదని నిషేధిస్తూ కాంగ్రెసు నియమావళిని మార్చవలసి యున్నదని ఆ ఉపన్యాసంలో సత్యమూర్తి పలికాడు.

ఇతర రాజకీయ సంస్థలలో సభ్యులు కాకున్నా, సత్యమూర్తి వంటి మితవాద కాంగ్రెసు నాయకులు కాంగ్రెస్ తీర్మానాలేవో తెలుసుకోకుండా మాట్లాడటం తటస్థిస్తోంది. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ ప్రత్యేకమైన ఒకరాజకీయ సంస్థ అను మాట నిజమే. కాని, అది ఏవిధంగానూ కాంగ్రెసు కార్యక్రమానికిగాని, కాంగ్రెస్ సిద్ధాంతాలకుగాని, విరుద్ధంగా వెళ్లడంలేదు. నేటి జాతీయ, అంతర్జాతీయ క్లిష్టపరిస్థితులలో ఐక్యసంఘటన యొక్క ఆవశ్యకతను ఎలుగెత్తి చాటే సోషలిస్టులు కాంగ్రెసునుండి తరుమగొట్టబడితే స్వరాజ్య పోరాటానికి ఎంత అపాయకరమో గతసంవత్సరం హరిపురాలో జవహర్లాల్, సుభాష్‌బోసులు యిచ్చిన ఉపన్యాసాలు చూస్తే బోధపడుతుంది.

**మధ్యపరగణాలలో పోలీసులకు శిక్షలు**

ఒకవైపున చాలా జిల్లా (పంజాబురాష్ట్రం) లో జరిగిన ఒక బహిరంగ సభలో పోలీసులు కాంగ్రెసు వాదులమీద క్రూరంగా లాఠీచార్జి చేస్తూంటే, దెవలప్‌మెంటు మంత్రి చూస్తూ ఊరుకున్నాడు. కాంగ్రెస్ ప్రతికూల మంత్రివర్గం పరిపాలన చేసే రాష్ట్రంలో మరొక విధంగా ఎందుకు జరుగుతుంది.

మధ్యపరగణాల మంత్రివర్గం మాత్రం అసలైన కాంగ్రెస్ మంత్రివర్గం అనిపించుకొంది. జబల్పూరు జిల్లాలో పోలీసులు కాంగ్రెవాదులు కొందరిమీద లాఠీఛార్జీ చేశారు. దానికి కారకులెవరో ప్రభుత్వం తరపున విచారణజరిగింది. విచారణానంతరం ముగ్గురు పోలీసు కాన్‌స్టబిల్సులను డిస్మిసు చేశారు. ఒక సబ్ ఇన్స్పెక్టరు మీదఒక హెడ్‌కాన్‌స్టబిల్‌మీద, డిపార్టుమెంటల్ చర్య తీసుకొనబడింది. మనరాష్ట్రంలో కూడా పోలీసులు తమ విధులేవో తెలుసుకోకుండా, విచ్చలవిడిగా ప్రజలపై లాఠీచార్జి చేస్తున్నారు. ఉదాహరణకు కాశీపట్నం సత్యాగ్రహం, కాకినాడ సమ్మె. ఈ లాఠీఛార్జీలకు కారకులైన పోలీసు ఉద్యోగులపై వెంటనే తగిన చర్యతీసుకోవడం కాంగ్రెసు మంత్రుల కనీస కర్తవ్యం.

**టారిఫ్ బిల్లు ఇండియా ప్రభుత్వపు మొండి పట్టుదల**

ఇండో బ్రిటిష్ వర్తకపు ఒడంబడిక యందలి షరతులు గల టారిఫ్ బిల్లును ఇండియా ప్రభుత్వం కేంద్ర శాసనసభలో ప్రవేశపెట్టినప్పుడు మెజారిటీ సభ్యులు దాన్ని నిరాకరించినప్పటికీ, వైస్రాయి పై శాసనసభలో కూడా దాన్ని చర్చించడానికి "సర్టిఫై" చేశాడు. ఇండియా ప్రభుత్వంయొక్క ఈ మొండి పట్టుదలను ఖండిస్తూ సత్యమూర్తి, బుల్లాభాయిదేశాయిగారలు ఎంత తీవ్ర శైలిలో ఉపన్యసించినప్పటికీ లాభంలేక పోయింది. చివరకు "స్టేట్సుమన్" వంటి యూరపియన్ పత్రిక (కలకత్తా) సహితము ఇండియా ప్రభుత్వంయొక్క వైఖరిని ఖండిస్తూ, వ్యాసం వ్రాసింది. రాబోయే యూరపియన్ సంగ్రామాన్ని మనస్సులో ఉంచుకోనైనా ఉంచుకొనకుండా, ప్రజాభిప్రాయాన్ని ధిక్కరించి, టారిఫ్ బిల్లును "సర్టిఫై" చేయడం ఏ మాత్రమూ వైస్రాయికి తగదని వ్రాసింది. అయినప్పటికీ, బిల్లును వైస్రాయి "సర్టిఫై" చేశాడు. పై శాసనసభలో 24 గురు అనుకూలంగానూ, 11 గురు ప్రతికూలంగాను వోటు చేశారు. బిల్లు ప్యాసయిందని అనిపించుకున్నాడు.

సాధారణంగా సామ్రాజ్యవాదులు తాము చేసే పనులకు ఎట్టి పర్యవసానం గలుగుతుందో ఆలోచించరు. ఈ టారిఫ్ బిల్లులో స్వదేశీ పరిశ్రమలయెడ ఇండియా ప్రభుత్వం చూపిన ప్రతికూల వైఖరికి జవాబుగా, బ్రిటిషు సరకులన్నింటిని, బహిష్కరించడానికి దేశములో బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమాన్ని లేవదీయవలసిందని సర్దార్ శార్దూలసింగు, సత్యమూర్తి మొదలయినవారు రాబోయే అ. భా. కాం. కమిటీ సమావేశంలో తీర్మానాలు ప్రతిపాదించదలచుకొన్నారు.

**శాఖావిభజన**

న్యాయ-కార్యనిర్వాహక శాఖల విభజన క్రమక్రమంగా జరుగ వలసిన పని అనీ, ప్రత్యేకమైన సబార్డినేట్ జడ్జీలను నియమిస్తే, జీతాలకు చాలా సొమ్ము ఖర్చు అవుతుందనీ, బొంబాయి శాసనసభలో కె. యం. మున్షీ (హోం మంత్రి) జవాబిచ్చాడు. కాని, యు. పి. వంటి కాంగ్రెస్ రాష్ట్రములో శాఖావిభజన సాధ్యం అయినప్పుడు ఇతర రాష్ట్రాలలో ఎందుకు సాధ్యం కాదో బోధపడదు. ఇట్టి ప్రధానాంశములమీద కాంగ్రెసురాష్ట్రా లన్నింటిలోను ఒకే మార్గం అవలంబించేటట్లు అ. భా. కాం. వర్కింగ్ కమిటీ ఉత్తరువు లివ్వవలసి యుంటుంది.

**సర్దార్ పటేలు సంస్థానాధీశులు**

అమ్రేలీలో జరిగిన ఒక బహిరంగ సభలో సర్దార్ వల్లభభాయి పటేల్ ఉపన్యసిస్తూ, "సంస్థానాధీశులతో పోరాడి రూపాయి సంపాదించేకన్న పోరాడకుండా అర్ధ రూపాయి సంపాదించడం మంచిద"ని ప్రజలకు సలహా యిచ్చాడు. వేర్వేరు సంస్థానాలలో నేడు ప్రజలు అతిస్వల్పమైన కోర్కెలకై అరెస్టులు, లాఠీచార్జీలు, తుపాకి గుండ్లకు గురియై జీవన్మరణ పోరాటం సాగిస్తూన్నప్పటికీ, అర్ధ రూపాయి కాదు సరికదా, ఒక దమ్మిడీ విలువగలిగిన సంస్కరణలయినా పొందలేకున్నప్పుడు సర్దార్ పటేల్ యిచ్చిన పై సలహా ఏ విధంగా యదార్థ పరిస్థితులకు వ్యతిరేకమో తెలుస్తుంది. "కాలపరిస్థితులను మీరు గుర్తించకుండా, ఎప్పటి మాదిరిగానే మొండిగా ఉంటే, సంస్థానాధీశుల వర్గమే పూర్తిగా తుడుచుపోతుంద"ని ఆ సభలోనే సర్దార్ పటేలు సంస్థానాధీశులను సంబోధిస్తూ పలికాడు.

కాని ప్రజలు సంస్థానాధీశులు పోరాటము లేకనే అర్ధరూపాయి స్వరాజ్యము ఇచ్చినా తృప్తి పొందరు. మిగిలిన అర్ధరూపాయి కోసం తప్పక పోరాడుతారు. అలా పోరాడమని సలహా నివ్వడము స్వాతంత్ర్య యోధుల కర్తవ్యము.



## రాజకోట

స్వదేశ సంస్థానాధీశుల దృక్పథమెట్టిదో రాజకోటలో స్పష్ట మగుతూ ఉంది. వివిధ మతస్థులను రెచ్చగొట్టి అల్పసంఖ్యాకుల మను చాకుతో ప్రజాపరిషత్తు ప్రతినిధుల మెజారిటీని తగ్గించడానికి ప్రయత్నించారు. కాని గాంధీజీ దానికి అంగీకరించక పోయినపుడు, గాంధీజీ సూచించిన 7 గురిలో 6 గురు రాజకోట సంస్థానాధీశులు కారని పేచీ పెట్టారు. గాంధీజీ స్వదేశ సంస్థానాధీశుని హృదయ మార్పుకోసం మరి కొన్ని సూచనలు గావించాడు. రాజకోట ఒక కమిటీని ఏర్పాటుచేసి ఒకరాజ్యాంగ ప్రణాళికను తయారు చేయించాలి, కాని రిపోర్టును, వల్లభాయిచే సూచించబడిన ఏడుగురితో కూడిన ప్రజాపరిషత్ కమిటీ తనిఖీచేయాలి. ఈకమిటి అంగీకరించని విషయాలలో, క్రొత్తసూచనలను చేస్తుంది ఆసూచనలను చీఫ్ జస్టిసు ముందు పెట్టి అతనిని నిర్ణయానికి ఉభయ పక్షాలు ఒప్పుకోవాలి. ప్రజాస్వామ్య నిర్మాణము, బ్రిటిషు న్యాయాధికారి చేతుల్లో పెట్టడానికి మేమెంతమాత్రము అంగీకరించము. కాని దీనికి కూడ స్వదేశ సంస్థానాధీశుడు అంగీకరించలేదు. మైనారిటీలకు ప్రత్యేక ప్రాతినిధ్యము ఇస్తూ, ఏడుగురిని ప్రతినిధులను ప్రజలు ఎన్నుకోవాలని సూచించాడు. గాంధీజీ ప్రతిష్టను మైనారిటీల ముందు భగ్నము చేయడానికి ఇట్టి కొంటె యెత్తులు వేశాడు ఆ స్వదేశ సంస్థానాధీశుడు. ఎన్నో ప్రయత్నాలుచేసినా ఒడంబడిక కుదరలేదు. "నే నపజయ మొందితిని. నేనిప్పుడే వృద్ధుడ నయితినని తెలిసికొంటిని. ఈ 15 దినముల అమూల్య కాలమంతయు వ్యర్థమైనది." అని హృదయావేదనతో రాజకోటను విడిచి వెళ్లాడు మహాత్ముడు.

* * * * * *

## సవరణలు

7 వ పేజీ మూడవ కాలములోని పద్యంలో మూడవపంక్తి ఈలా ఉండాలి.

"ఎదురు చూచును మరణ మెప్పుడు నటంచు"

5 వ పంక్తి పద్యానికి సంబంధించినది కాదు, కొట్టివేసుకోవాలి.

* * * * * *

8 వ పుట, 2 వ కాలములో 7 వ లైనులోని వాక్యము ఈక్రింది విధంగా ఉండాలి. "దీనిని బట్టి పెద్ద కంపెనీలమీదనే పన్ను వేయబడింది. చిన్న కంపెనీలమీద వేయబడలేదు."

9 వ పుటలో నాల్గవకాలములో ఆఖరి పేరాకు ముందు పేరాలో 5 వ లైనులో "రు 10" లకు బదులు "రు 100" లని ఉండాలి. 6 వ లైనులో "రు 20" లకు బదులు "రు 200" లని ఉండాలి.

# కావలిలో ఫెడరేషను వ్యతిరేక ప్రచారం

### 14 వ తేదీ

నెల్లూరు జి॥ కోవూరు తాలూకానుండి జిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీల యాజమాన్యమున బయలుదేరిన ప్రచారకదళము 14 వ తేదీ సాయంత్రము కావలితాలూకాలోని సిద్ధనపాలెం చేరినది. అచ్చటివారు సిద్దనపాలెము, దాని ప్రక్క గ్రామమైన వెంకటేశు పాలెము శ్రోత్రిదారులవనియూ, భూములు చాల సారహీనమైనవనియు, నీటి వసతి గూడ లేదనియు తెల్పిరి. శ్రోత్రియందారులు యకరానికి 1కి రు. 5-0-0 లు పన్ను వసూలు చేసుకొనుచుండిరి. 1938 సంవత్సరములో అల్లూరు చెరువునుండి నీరు సప్లయి చేయమని ఇంజనీరు, కలెక్టరు మొదలగు వారికి అర్జీలు పెట్టుకొనగా యకరం 1కి రు. 0-4-0 నీటిశిస్తుయిచ్చేయెడల నీళ్ళుసప్లయి చేసెదమనగా రైతులు సరేననిరి. నీళ్ళుకూడా సప్లయి చేసిరి. 1938 లో సిస్తు వసూలప్పుడు యకరాకు రు. 4-8-0 శిస్తుకట్టమని గవర్నమెంటు డిమాండు పంపగా శ్రోత్రియందారులు రు. 4-8-0 లు తమకు కూడ కట్టమని డిమాండుపంపిరి. అప్పుడు శ్రోత్రియందారులతో నీళ్ల గవర్నమెంటు సప్లయి చేయుచున్నది గాన నీటి పన్ను గవర్నమెంటువారున్నూ మెట్టరేటు మాత్రము అనగా యకరానికి రు. 1-0-0 లు మీరును వసూలు చేసుకొనమని చెప్పిరి. శ్రోత్రియందారులు యకరాకు రు. 2-8-0 లు వసూలు చేసుకొనుటకు అంగీకరించి ఆ విధముగనే చేసిరి. 1937 మాదిరిగానే 1938 లో గవర్నమెంటువారి నీటితోనే పంటలు పండించుకొనిరి. గవర్నమెంటుకు రు. 4-8-0 లు యిప్పుడు కట్టుచున్నారు. శ్రోత్రియందారులు యీ సంవత్సరము మరల యకరాకు 5-0-0 లు కట్టమని నిర్బంధించుచున్నారనియు, ఇంతవరకు ఒక వాయిదా కట్టి నిలిపియుంచినామనియూ, రెండవ వాయిదా గడువుమీరి నందున అనేకమైన బెదరింపులు చేయుచున్నారనియూ, శ్రోత్రియందారులు పొనకా గోవిందరెడ్డిగారు, మారంరెడ్డి రామిరెడ్డిగారు మరికొందరు భాగస్థు లనియు చెప్పిరి. దీని విషయమై జిల్లాకాంగ్రెసుకు, జిల్లా రైతు సంఘానికి అర్జీలు పెట్టుకొనమని సాయంత్రము మీటింగు ప్రారంభించిరి. గ్రామములోని రైతులందరును వచ్చిరి. డి. అక్కయ్య రైతుల కష్టాలను గురించియు, యన్. శంకరయ్య తెల్లప్రభుత్వము మన దేశములో పరిపాలన మొదలుపెట్టి నప్పటినుండి చేసిన అన్యాయములను గురించి, బి. శంకరయ్య యుద్ధము వచ్చేయెడల స్వాతంత్ర్య పోరాటము యే స్థాయిలో నడుపవలెను అనే విషయమును గురించి చెప్పిన పిమ్మట సభ ముగింపబడెను.

### 15 వ తేది

ఉదయం వెంకటేశుపాలెం చేరి గ్రామమంతయు రైతు పాటలతోను, నినాదములతోను తిరిగి మీటింగుపెట్టగా గ్రామములోని స్త్రీలు పురుషులు అందరూవచ్చిరి. డి. అక్కయ్య రైతుగీతాలు పాడినపిమ్మట యన్. శంకరయ్య రైతుల యిబ్బందులను ఇంగ్లీషు ప్రభుత్వముచేయు అన్యాయములు చెప్పిరి. బి. శంకరయ్య శ్రోత్రియందారులు వారిని సిద్దనపాలెం వాళ్ళను బెదిరించిన భయపడక జిల్లా కాంగ్రెసు, జిల్లా రైతుసంఘములతో సంప్రదించవలసినదనియు, యుద్ధము వచ్చేయెడల కాంగ్రెసు నిర్ణయించియున్న ప్రకారం అదే సమయమున స్వరాజ్యమును సంపాదించవలసినదని చెప్పి సభ ముగించిరి. ఆగ్రామ మజరా అయిన వడ్డిపాలెంవెళ్ళి కూలీల కష్టాలను గురించి కూలీ సంఘాలావశ్యకతను గురించి, కూలీలు కాంగ్రెసులో చేరవలసిన ఆవశ్యకతను గురించి ఉద్బోధించిరి.

మధ్యాహ్నము జువ్వలదిన్నెచేరి మీటింగు పెట్టగా 30 మంది సభకువచ్చిరి. యన్. శంకరయ్య కాంగ్రెసుమ గురించి బి. శంకరయ్య నేషనల్ డిమాండు తీర్మానమును గురించి ఉపన్యసించిన పిమ్మట సభ ముగింపబడెను.

సాయంత్రం ముంగమూరిచేరి గ్రామచావడి వద్ద మీటింగుపెట్టిరి. 100 మంది వచ్చిరి. బి, శంకరయ్య కూలీ రైతుల ఐక్యతావశ్యకతను గురించి, నేషనల్ డిమాండు తీర్మానమును గురించి, యుద్ధము వచ్చేయెడల ఆసమయములో ఇంగ్లీషు గవర్నమెంటును లేకుండా చేయుటకు యిప్పటినుండి ప్రతి గ్రామమున కాంగ్రెసు సంఘాలుపెట్టి గ్రామములో ప్రజలందరూ చీలికలు లేకుండా చేసుకొనవలెనని చెప్పిరి.

### 16 వ తేది

ఉదయం 10 గంటలకు తాళ్ళపాలెం పోయి మీటింగు పెట్టగా 10 మంది రైతులువచ్చిరి. బి. శంకరయ్య కాంగ్రెసులో చేరవలసిన ఆశ్యకతను గురించి చెప్పినపిమ్మట సభ ముగింపబడెను.

మధ్యాహ్నం 2 గంటలకు బయలుదేరి లింగంగుంట, లింగంగుంట మజరా, కొత్తూరు, అముదాలదిన్నె గ్రామాలలో రైతుల యిబ్బందుల గురించి వారికి యేదైన యిబ్బంది జరిగినవుడు తాలూకా కాంగ్రెసు సంఘమునకు, జిల్లా కాంగ్రెసు సంఘమునకు అర్జీ పెట్టుకొనవలెనని, కాంగ్రెసులో చేరవలెనని చెప్పి 5 గంటలకు కావలి చేరితిమి.

ముందుగా మీటింగు యేర్పాట్లు ఏమీ చేసి యుండనందున మీటింగు జరుగలేదు.

### 17 వ తేది

ఉదయం కొత్తపల్లెకుపోయి 11 గంటలకు గ్రామమంతయు కూలీరైతు పాటలతో తిరిగి స్కూలులో మీటింగు పెట్టగా 50 మంది రైతులొచ్చిరి. యన్. శంకరయ్య రైతుల కష్టాలను గురించి భూమిపన్నులు యిప్పటిమాదిరి యకరం 1 కి యింతయని కాక ఆదాయముమీద పన్ను వేయవలెననియూ కుటుంబ ఖర్చులకు సరిపోవు కనీసపు ఆదాయముమీదపన్ను వుండకూడదనియు వచ్చే పన్నులన్నియు రైతులకు ఉపయోగమునకుగా డెల్టాలు వైద్యసౌకర్యములు కలిగింపవలెననియూ చెప్పిరి, బి. శంకరయ్య నేషనల్ డిమాండు తీర్మానమునుగురించి కాంగ్రెసులో చేరవలసినావశ్యకతను గురించి చెప్పినమీదట సభ ముగింపబడెను. తర్వాత ఆ గ్రామస్థులు తమ గ్రామమునకు చింతలపాలెంకు పీటి మజరాగ్రామాలకు తక్కువ ఖర్చుతోనే వుప్పుటేరునుండి నీటి సప్లయి చేయవచ్చుననియు యిప్పుడు తమకు సరిగా పండుట లేదనియూ చెప్పిరి.

మధ్యాహ్నం 12 గంటలకు చింతలపాలెం గ్రామచావడివద్ద మీటింగుపెట్టి బి. శంకరయ్య నేషనల్ డిమాండు తీర్మానమునుగురించియు కాంగ్రెసులో చేరవలసినావశ్యకతనుగూర్చియు చెప్పినపిమ్మట అచ్చటిరైతులు తమది శ్రోత్రియ గ్రామమనియు ప్రకాశం బిల్లు వలన తమకు చాలా అన్యాయము జరిగినదనియు జస్టిస్‌పార్టీ వారు చేసిరి సౌకర్యమును కూడా కాంగ్రెసువారు తీసివేసినారనియు చెప్పిరి. ప్రకాశం రిపోర్టు యింకా చట్టముకాలేదనియు యీలోపల మీరు ఆందోళనచేసిన దానిని మీకు అనుకూలముగా మార్పించవచ్చుననియు చెప్పిన పిమ్మట సభముగించబడెను.

సాయంత్రము 7 గంటలకు భీమవరపుపాడు చేరితిమి. గ్రామ చావడివద్ద మీటింగు పెట్టగా గ్రామములోని రైతులందరూ (100 మందికి పైగా) వచ్చిరి. యన్. శంకరయ్య భూమిపన్ను విధానముగూర్చి కుటుంబఖర్చులకు కొంత ఆదాయము మినహాయించి ఆదాయాభివృద్ధి ననుసరించి భూమిపన్ను వేయవలెననియూ, వసూలగు పన్నులలో అధికభాగము రైతుల కూలీల సౌకర్యాలకు ఖర్చుపెట్టవలెననియూ యిప్పటి ఇంగ్లీషుగవర్నమెంటు అట్లు చేయుటలేదనియు, తొందరలో స్వరాజ్యమును సంపాదించుకొని పైపద్ధతులను అమలులోకి తీసికొనివచ్చుటకు అందరమూ కాంగ్రెసులో చేరి స్వరాజ్యముకొరకు కృషిచేయవలెనని చెప్పిరి. బి. శంకరయ్య 1914 యుద్ధమునకు పూర్వము కాంగ్రెసు కేవలము అర్జీలతోను తీర్మానాలతోను కాలము గడుపుచుండెననియు యుద్ధములో ఇంగ్లీషు గవర్నమెంటుకు సహాయము చేసెననియూ, యుద్ధము ముగిసినపిమ్మట స్వరాజ్యము యిచ్చునని నమ్మియుండెనని చెప్పిరి. యుద్ధమప్పుడు ఇంగ్లీషువారిని నమ్మక అదేసమయములో స్వరాజ్యమును తీసికొన వలెనని పని చేసినవారిని అండమానులకు పంపియూ, ఉరితీసియూ, అనేక కష్టములను బ్రిటిషు ప్రభుత్వము పెట్టినది కాంగ్రెసు సపోర్టు లేనందున యుద్ధసమయములలోనే స్వరాజ్యము సంపాదించవలెననే వారిని సులభముగా తెల్లగవర్నమెంటు అణచివేసెననియు ఆసిరి. యుద్ధము అయిన తర్వాత ఇంగ్లీషువారు నమ్మకద్రోహము చేయుటయేగాక రౌలట్ ఆక్టు అమలు పరచడము, జలియనువాలాబాగ్‌లో మన దేశస్థులను కాల్పించడము మొదలగు అనేక ఘోరములు చేసిన పిమ్మట కాంగ్రెసు యీ ఇంగ్లీషు గవర్నమెంటును ఇక నమ్మరాదని, వీరి పరిపాలన యిక దేశములో సాగనియ్యకూడదని తీవ్ర ప్రయత్నములు చేయుచున్నదని చెప్పారు. మరల యుద్ధము వచ్చేయెడల వీరికి సహాయము చేయరాదని కాంగ్రెసు తీర్మానించినదనియు, జవహర్లాల్ గారు యుద్ధము వచ్చేయెడల పన్నుల నిరాకరణము చేయవలెననియూ సైనికులను మన దేశమునుండి పోకుండా చేయవలెనని చెప్పిరనియూ, పైవిధముగాచేసి స్వరాజ్యము సంపాదించవలెనన్న యిప్పటినుండి మనము తయారు కావలెనుగాన గ్రామగ్రామాన కాంగ్రెసు కమిటీలు పెట్టుకొని గ్రామస్థుల యిబ్బందుల కొరకు తీవ్రముగా పనిచేస్తూ వుండవలెనని చెప్పి సభ ముగించిరి. పిమ్మట ఆ గ్రామ సమీపములో నున్న మాదిగ వాడలోని కూలీలు 30 మంది వచ్చిరి. కూలీల యిబ్బందులను గురించి రైతులు తక్కువ కొలతపాత్రలతో కూలీలకు కూలి యిచ్చుటది (కూలి యివ్వక పని చేయించుకొనుట) కూడదనియు రైతులు, కూలీలు కలిసి స్వరాజ్యమును సంపాదించిన యిద్దరి కష్టములు తొలగుననియూ చెప్పి సభ ముగించబడెను.

# మహావీర్‌సింగు ఆత్మ బలిదానం

కామ్రేడ్ కాట్రగడ్డ రాజగోపాలరావు

అది జనవరి 26 వ తారీఖు. "మాకు స్వాతంత్ర్యం కావాలి" అని లక్షలాది ప్రజలు ఐక్యకంఠముతో ప్రతిజ్ఞచేశారు. "స్వాతంత్ర్యము మాకు పుట్టుక హక్కు" అని ఆసేతుహిమాచల పర్యంతం అసంఖ్యాకమైన జనసామాన్యం ఎలుగెత్తిచాటింది. ఆనాడు యీదానికి ముఖాలమీద ఒక విధమైన గర్వమూ, ఉల్లాసమూ తాండవించింది. హృదయంలో ఆవేశంకల్గింది. రక్తం ఉడికిపోయింది. "మేము స్వాతంత్ర్యరణభేరిని మోగిస్తాము" అని ప్రజలు గర్జించారు. కాస్త ఆగినాక—నాకు హుషారుతన్నేసింది. గంటలువేళ. ఓహ్! ఆకాశంమీదికి ఎగిరిపోయా. మళ్ళీ క్రిందికి దిగుతుండేసరికల్లా—"స్వాతంత్ర్యం ప్రతివాడు—కావాలంటున్నాడు. బాగానే ఉంది. కాని ఈ స్వాతంత్ర్యం కోసం బలి అవటానికి ఎంతమంది సిద్ధంగా ఉన్నారు?" అని టక్కున నాలోనాకు ఒక ప్రశ్న కలిగింది. ఇలా ఆలోచిస్తూండగానే—గత భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలు నాకళ్ళకు కట్టినట్లయ్యాయి. ఎన్నో విషయాలు. ఎన్నో ఘటనలు జ్ఞప్తికి వచ్చాయి. ఎంతోమంది వీరులు స్మరణకు వచ్చారు. అందులో ఒకడు మన కామ్రేడ్ మహావీరసింహా.

## విప్లవ వాతావరణం

సంయుక్తరాష్ట్రంలో ఎవాజిల్లాలో రాజుపుర మనే గ్రామంలో ఇతను జన్మించాడు. తండ్రి పేరు దేవీసింహుడు. తల్లి శారదాదేవి. వీరు పురా మంచి ధార్మికప్రవృత్తి కలవారే. కాని గత ప్రపంచ మహాయుద్ధానంతరం దేశంలో రాజకీయ తుఫాను వీచేసరికల్లా—ఆ తుఫానులో వీరి జాతి, మత, ధర్మ, భగవచ్చింతలు కొట్టుకొని పోయాయి. భారతస్వాతంత్ర్య సంపాదనోత్సాహం వెల్లివిరిసింది. అతనుకూడా స్వాతంత్ర్య సంగ్రామంలో పోరాడటానికి సిద్ధమయ్యాడు. అతనేకాదు—అతనేకాదు—ఇంకెందరో స్త్రీలూ, పురుషులూ, వృద్ధులూ, యువకులూ స్వాతంత్ర్యదీక్ష బద్ధకంకణులయ్యారు. ఒకవైపున స్వాతంత్ర్యంకోసం పోరాడే జనసామాన్యమూ, ఇంకోవైపున బ్రిటిషుసామ్రాజ్యవాద ప్రభుత్వమూ, దానికి మద్దతుచేసేవాళ్ళ రాక్షసశక్తి—పోలీసులూ, సైన్యమూ, కోర్టులూ, జైళ్ళూ ఉన్నాయి. మళ్ళీ బాగా యుద్ధం జరిగింది మొదట్లో తీవ్రంగాపోరాడినా—మనకు విశేషానుభవంలేదు. మన నాయకులు మంచి ఆరితేరిన నేర్పరులూకాదు. మన సంఘటన సరిగా లేనూలేదు. ప్రభుత్వంయొక్క దారుణహత్యాయంత్రాలు బాగా అర్హరులో ఉన్నాయి. వాళ్ళ సంఘటన బాగా దృఢంగా ఉంది. మనం ఓడిపోయాము. కాని ఇప్పుడు మనం మనశక్తిని కాస్త కాస్త అనుభవంలోకి తీసుకొనిరాసాగాము. మన హృదయాలు ఆవేశపూరితాలయ్యాయి. మనలో అకుంఠిత సాహసమూ, ఉత్సాహమూ ఉద్రేకమూ ఉప్పొంగినాయి. మహావీరసింహుడు ఆరోజుల్లో బళ్ళోచదువుకుంటున్నాడు. కాని బడి వెలుపల నలుప్రక్కలా వ్యాపించిన విప్లవవాతావరణము అతని కోమల హృదయాన్ని ఆకర్షించినవి.

ఒకనాడు ప్రభుత్వోద్యోగస్థు లందరూ ఒక శాంతి సభను ఏర్పాటుచేశారు. జిల్లాకలెక్టరు, పోలీసు సూపరింటెండెంటూ, స్కూల్సు యిన స్పెక్టరు ఇంకా చాలామంది ధనవంతులూ, గొప్పవాళ్ళూ ఆసభకు అరుదెంచారు. బడిలోని చిన్న చిన్న పిల్లకాయల్నిగూడ బలవంతాన తీసికొని వెళ్లి ఆసభలో కూర్చోపెట్టారు. వీళ్ళల్లో మన మహావీరసింగ్‌కూడా ఉన్నాడు. బ్రిటిషు ప్రభుత్వాన్ని పొగడటంతోనూ, స్తోత్రం చేయటంతోనూ, మహాత్మాగాంధీని తిట్టడంతోను సభాకార్యక్రమం ప్రారంభించబడింది. ఈచిన్న పిల్లకాయలందరూ పంతులు కొడతాడేమోనని భయంతో గప్‌చిప్‌గా ఊరుకున్నారు కాని లోపల మండుకుపోతోంది. వాళ్ళల్లో ఎవరో మహాత్మాగాంధీకి జై అన్నారు. అందరూ కలిసి మహాత్మా గాంధీకీ జై జై జై అని జయజయ ధ్వానాలతో సభా భవనమంతా ప్రతి ధ్వనింపచేశారు. అఫీసర్లూ, ఉద్యోగస్థులూ కంగారుపడ్డారు. వాళ్ళలో కొందరు - యూసిగ్గుని - అవమానాన్ని - భరించలేక కర్రలతో కుర్రవాళ్ళని చావమోదారు. సభకు విఘ్నంకలిగింది. గల్లంతు చేసినవాళ్లల్లో ఎవరెవరు ముఖ్యులో జాడ తీయాల్సిందని మాష్టర్లకు తాఖీదులొచ్చాయి. జాడతీశారు. 13 సంవత్సరాల బాలుడు మహావీరసింహుడు తిరుగుబాటుకు నాయకుడు అని నిర్ధారణ అయింది. శిక్ష పడింది. సంతోషపూర్వకంగా అనుభవించాడు. కాని విప్లవశక్తులు మరీ దృఢపడ్డాయి.

## హిందుస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ.

మెట్రిక్ ప్యాసయినాక 1925 లో మహావీరసింహా కాలేజీవిద్య అభ్యసించటానికి కాన్పూరులో డి. ఏ. వి. కాలేజీలో చేరాడు. అప్పుడే ప్రథమ సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రభుత్వము కఠిన నిర్బంధవిధానంచే అణచివేసింది. అయినా భారతదేశీయ విప్లవశక్తులులోలోన రగుల్కొంటూనే యున్నాయి. నాయక బృందం ప్రత్యక్షపోరాట మార్గాలని వదలిపెట్టి శాసన సభలద్వారా చట్టసమ్మతమైన పోరాటం సాగిస్తున్నారు. నాయకత్వం లేకపోయేసరికల్లా యీ విప్లవశక్తులలో అసంతృప్తి వ్యాపించింది. ఎవరిదారి వాళ్ళు వెతుక్కున్నారు. తమపైన జరుపబడుతున్న లెఖ్ఖలేని అన్యాయాలకూ, నిర్బంధాలకూ వ్యతిరేకంగా బయలుదేరే రైతుల స్వాభావిక ప్రతిక్రియ దేశమంతటా గల్లంతులూ ఉపద్రవమూ రూపంగా పరిణమించింది. (మలబారులో మాప్లా తిరుగుబాటు, ఆంధ్రదేశంలో అల్లూరి సీతారామరాజుచే నడుపబడ్డ మన్యం రైతుల తిరుగుబాటు, బెంగాలులో మిద్నపూరు మొదలైనచోట్ల జరిగిన గల్లంతులు, పంజాబులో బబరు అకాలీల తిరుగుబాటు మొదలైనవి ఆసమయంతో వృద్ధిపొందుతున్న రైతుల విప్లవ పోరాటానికి (ప్రమాణాలు) కార్మికుల స్ట్రైక్ యూనియన్ ఉద్యమం కూడా అతివేగంగా వృద్ధిపొందుతోంది. భారత నవ యువకుల్లోని ఒక ముఠా కార్మికోద్యమాన్ని చేపట్టింది. వీరే కమ్యూనిస్టులు. వీరు కార్మికోద్యమాన్ని కేవలం ఆర్థిక హక్కులకోసం పోరాడేదానినిగానే కాకుండా రాజకీయాధికారాన్ని పొందే టందుకు విప్లవయుతమైన పోరాటానికి తయారుచేయాలని కోరుతుండేవారు. ఈ కమ్యూనిస్టుల అభివృద్ధిని చూచి భయపడి బ్రిటిషు ప్రభుత్వము కాన్పూరు కమ్యూనిస్టు కేసును 1924 లో నడిపింది. ఇలాంటి నవయువకుల ముఠాయే ఇంకోటి ప్రస్తుత ప్రభుత్వాన్ని కడుపులో నీళ్లు కదలకుండా భారతదేశంలో రాజ్యపరిపాలన చేయనీయకూడదని ప్రతిన చేసింది. వీరినందరినీ పోలీసులు పట్టుకొని దక్షిణేశ్వర బాంబుకేసనీ, కాకోరీ కుట్రకేసనీ కేసులు బనాయించారు. అప్పుడు దేశంలో రాజకీయ వాతావరణం అన్నిచోట్లా తిరుగుబాటు లాగాలేచింది. మహావీరసింహ్ దీనికి దూరంగా ఉండలేకపోయాడు. ఉండాలని అనుకోలేదు కూడా. ఇతడు హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీలో మగ్నమయ్యాడు. ఇల్లు వదిలాడు. కాలేజీ వదిలాడు. తల్లిదండ్రుల్నీ చుట్టపక్కాలనీ అందరినీ వదిలాడు. ఇతనికి ఇతని పార్టియే నూతన బంధువర్గమయింది. ఈ పార్టీ యొక్క ఆదర్శము బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని పాతిపెట్టి దేశంలో సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని వ్యాపింపచేయటమే. ఇందుకు సాధనం ప్రజాసామాన్యంయొక్క రక్తమయ విప్లవమే. దేశానికి—ముఖ్యంగా క్రింది తరగతిలోనూ, మధ్య తరగతిలోనూ, బాగా విజ్ఞానవంతులైన యువకులకు నేటి మన సాంఘిక వ్యవస్థలోని తుత్తునియలు చేయాల్సిన ప్రధాన లోపాన్ని చూపెట్టి సాహసకృత్యాల ద్వారా వాళ్ళల్లో రాజకీయ వాతావరణాన్ని కల్గించటమే యీపార్టీకి తాత్కాలిక కార్యక్రమము. మహావీరసింహ్ తన సర్వస్వాన్ని యీ పార్టీకి అర్పించాడు. తనకున్న సర్వశక్తుల్నీ పార్టీలోనే లగ్నంచేశాడు. ఇప్పుడు తను ఒక ప్రధాన విప్లవకారుడు అయ్యాడు. యు. పి. లో అవసరమైతే యు. పి. లో ఉండేవాడు. పంజాబులో అవసరముంటే పంజాబు వెళ్ళేవాడు. పార్టీలో మంచి మోటారు డ్రైవరు కావాల్సి వచ్చింది. ఇతడు కొద్దిరోజుల్లోనే అధిక పరిశ్రమచేసి మంచి మోటారు డ్రైవరయ్యాడు. పార్టీవద్ద డబ్బులేదు. పంజాబు నేషనల్ బ్యాంకుని దోపిడీ చేయటానికి స్కీమువేశారు. మహావీరసింహ్ అందరికంటే ముందే, అనుకొన్న సమయానికి, బ్యాంకు దగ్గరకు వెళ్లాడు. పంజాబుకేసరి లాలా లజపతిరాయిని లాఠీలతో కొట్టేసరికి వారు చనిపోయారు. ఈ జాతీయావమానానికి బదులు కసిదీర్చు కోటానికి లాహోరులో పోలీసు సూపరింటెండెంటు సాండర్సును హత్య చేశారు. మహావీరునికి ఇందులోకూడ ప్రముఖపాత్ర ఉంది. మహావీర సింహా మంచి కార్యకర్తయూ, సాహసవంతుడునూ అయిన విప్లవ యువకుడు.

## లాహోరు కుట్రకేసు

1929 జూన్‌లో మహావీర సింహా లాహోరు కుట్రకేసులో అరెస్టయి లాహోరు వచ్చాడు. మొట్టమొదట గూర్జరసింహ్ దుర్గంలో పెట్టి పరీక్ష చేశారు. కాని లాభంలేకపోయేసరికల్లా జైలులో పడవేశారు. ఆరోజులలో జైలు జీవితమంటే అందులో ముఖ్యంగా మన మహావీర సింహునికీ, అతని అనుచరులకూ ఎలా ఉంటుందో చెప్పాలా? తలొకచోటా-దూర దూరంగా-చిన్ని చిన్ని యిరుకైన చీకటి కొట్లల్లో ఎప్పుడూ పడి ఉండాల్సివచ్చేది. ఇక తింటానికి — ఆ నల్లటి కుండ బొచ్చెలో—సగం మట్టి, యిసుకతో నిండియుండే ఉప్పుడు బియ్యపు నూకతో తయారు చేయబడ్డ ఆకూడూ, ఇనుప సీలలతోనూ, పురుగులతోనూ నిండియుండే ఆ నల్లటి దేవతావులుసూ ప్రతిరోజూ దాపురించేయి. పడుకోటానికీ, కప్పుకోటానికీ నల్లులతోనూ, పేనులతోనూ నిండిఉండే చిరిగిపోయిన పాత కంబళ్లు యిచ్చేవారు. పుస్తకాలూ, పేపర్లూ ఇచ్చేవాళ్ళు కాదు. ఎవరన్నా చూడటానికివస్తే దర్శనమనలేదు. పైపెచ్చు జైలర్లు తిట్టుతుండేవారు. కేసులు విచారించేటప్పుడు కోర్టులోకి వెళ్ళితే అక్కడ పోలీసుల పెత్తనం వెలుగుతుండేది. సర్దార్ భగత్సింగూ, బి. కె. దత్తూ, ఢిల్లీ అసెంబ్లీ కేసులో తీర్పుఅయిన దగ్గరనుంచీ రాజకీయ ఖైదీలకు సౌకర్యాలు కల్గించాలని నిరశనవ్రత మారంభించారు. బోర్స్టలు జైలులో ఉన్న మహావీరసింహూ, అతని అనుచరులూ జులై 18 వ తారీఖున నిరశ వ్రత దీక్ష పూనటానికి నిశ్చయించుకున్నారు. బయటివాళ్ళు అనేకరకాల బోధించారు. పండిట్ జవహర్‌లాల్, సుభాస్‌బాబూ, కీ॥ శే॥ గణేశ శంకర విద్యార్థి మొదలైనవారు అనేకరకాల చెప్పారు. కాని నిరశనవ్రతం చేయాలనుకున్న వాళ్ళంతా తమ శపథంమీదనే నిలబడ్డారు. ప్రభుత్వము అనేకవిధాల బెదరించింది. దండించింది. లాభం కన్పడలా. చివరకు డాక్టర్ల రాక్షసకృత్యాలు రంగంలోకి వచ్చాయి.

## నిరశన వ్రతం

నిరశనవ్రతం పూనిన ఒక్కొక్కరినీ పదేసిమంది బంట్రోతులు పట్టుకొనేవాళ్లు. అతని కాళ్లూ, చేతులూ, తలా, పొట్టా అన్నీ గట్టిగా అణచిపెట్టి తమ స్వాధీనంలో ఉంచుకొనేవాళ్ళు ముక్కులోగుండా అర్థగజంబారుగల రబ్బరు గొట్టాన్ని పొట్టలో దూర్చేవాళ్ళు. గెరాటులాంటి దాని మూతిగుండా పాలుపోసేవాళ్ళు. ఇందుమూలాన తఱచుగా ముక్కువెంబడి రక్తం కారుతుండేది. గొంతుకలో పుండ్లు పుడుతుండేవి. పన్నారోజులు నిరశనవ్రతం పూనటంవల్ల బలహీనమయి-పాపం-ఎన్నోసార్లు ఒంటరిగా - నిస్సహాయులుగా మూర్ఛపోతుండేవాళ్ళు. అందులో ఒకరికి న్యుమోనియా వచ్చింది. కాని జైలర్ల జులుము యథాప్రకారం గానే సాగుతూ వచ్చింది. ఈ నిర్బంధాలను, దారుణ చర్యలను అందరూ ఎదిరిస్తూనే ఉండేవారు. కాని మహావీరసింహు అందరికంటే ఎక్కువ పట్టుదలతో గట్టిగా ఎదిరించుతుండేవాడు. ఆ గొట్టాన్ని ముక్కులోనుంచి లోపలకు దూర్చగానే డగ్గి నోట్లోనుంచి బయటికితీసి పళ్ళతో బాగా నొక్కిపట్టి ఉంచి గంటలకొలదీ పడి ఉండేవాడు. ప్రాణాయామంలో ఇతనికి మంచి అభ్యాసం ఉంది. అందుకనే "కర్మలుబార్కరు" పొట్టలో గొట్టందూర్చి గంటసేపు తన్నుకున్నా ఒక్కబొట్టు కూడా లోపలికి పోయేదికాదు. గవర్నమెంటు డాక్టర్లకందరికీ మహావీరసింహుని పౌరుష పరాక్రమాలు ఆశ్చర్యం కల్గించాయి.

చివరకు ప్రభుత్వం లొంగిపోయింది. రాజకీయ ఖైదీలకు తగిన సౌకర్యాలు కల్గించటానికి అంగీకరించింది. నిరశనవ్రతం జయప్రద



మయింది. కాని యీజయంకూడ చాల కష్టంమీదనే కల్గింది. కామ్రేడ్ జతీంద్రనాథదాసు యీ సంగ్రామంతోనే మృత్యుసన్నిధిచేరాడు దీని తర్వాతకూడ లాహోరు ఖైదీలకు సౌఖ్యం కల్గలా. జైలర్లయొక్కా, పోలీసులయొక్కా దారుణచర్యలు ఎక్కువకాసాగాయి. ఎన్నోసార్లు యీఖైదీలను జైలులోకొట్టారు. ఎన్నోసార్లు కోర్టులో మేజిస్ట్రేటుఎదుట పోలీసులు కర్రలతో బాదారు. ఎన్నో నిరశన వ్రతాలు అయ్యాయి. పైగాయికూడా యీ ఖైదీలకోసం ఒక నూతన చట్టాన్ని ఏర్పాటు చేశాడు. క్రొత్త ట్రిబ్యూనల్ వచ్చింది. ఇది వచ్చిన మూడోరోజునే ఆంగ్లేయ జడ్జీ మిస్టరు కోల్డ్‌స్ట్రీమ్ భారతీయ జడ్జీ అయిన ఆగాహైదరుని అడగనైనా అడగకుండా యీఖైదీల కందరికీ బేడీలు వేయాల్సిందని పోలీసులకు ఫర్మానా పంపించాడు. ఖైదీలు ఒప్పుకోలా. పోలీసులు లాఠీలతో చావమోదారు. బాగా దెబ్బలు తగిలి గాయపడి ఉన్నఅవస్థలో వారిని మోటారులో క్రుక్కి, తొక్కి జైలుకుపంపిచేశారు. ఇది జరిగినతర్వాత ముద్దాయిలు మళ్ళి కోర్టుకు వెళ్లలా. ఒకపక్క కేసు నడుస్తోంది. ముద్దాయిలు మాత్రం కేసులో ఎలాంటి సంబంధమూ పెట్టుకోలా. "మేము బ్రిటిషుప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్నామని మామీద కేసులు పెట్టారు. బ్రిటిషుప్రభుత్వంచే నిర్మించబడ్డ యీ కోర్టులు న్యాయంకల్గిస్తాయని మాకు నమ్మకం లేదు. అందువల్ల మేము న్యాయంపేరుతో జరిగే యీ బూటక నాటకంలో జోక్యంకల్పించుకో దలచుకోలా" అని వారు తమ వాఙ్మూలంలో ముందుగానే చెప్పారు. 16 నెలలు కేసు విచారణ జరిగింది. మహా వీరునికి కూడా ఉరిశిక్ష పడుతుందని అంతా అనుకున్నారు. కాని మహావీరసింహ "నేను రాజపుత్రునిలాగ మరణిస్తాను" అని ప్రేమతో చక్కగా చిరునవ్వు నవ్వుతూ అంటుండేవాడు. 1930 అక్టోబరు 7వ తారీఖున తీర్పు అయిపోయింది. భగత్‌సింగూ, సుఖదేవ్, రాజగురులకు ఉరిశిక్షపడింది. మహావీరునికి ఆజన్మ కారాగారవాస శిక్ష విధించబడ్డది.

## జైలు జీవితం

శిక్ష పడ్డతర్వాత ఇతనుకొన్ని రోజులు మూల్టాన్ సెంట్రల్ జైలులో ఉన్నాడు. 1931 జనవరిలో మహావీరసింహునీ, అతని అనుచరుల్ని ఇంకా ఐదుగురునీ మద్రాసు ప్రాంతానికి పంపించారు. ఇక్కడ ఇతనినీ, ఇతని సహచరుడు డాక్టరు గయాప్రసాద్‌నీ బళ్లారి జైలులో ఉంచారు. స్థలం క్రొత్తది. భాష క్రొత్తది. ఆచార, వ్యవహారాలు క్రొత్తవి. వేషభాషణలు క్రొత్తవి. అన్నీ క్రొత్తవే. అటువంటి స్థలంలోకి తీసికొనివచ్చి వీళ్ళనిద్దరినీ నిర్బంధంలో ఉంచారు. ఇక్కడ వీరిని అనేకరకాల యిబ్బందులు పెట్టారు. మహావీరసింహుని బాగా వెంచిన గొర్రెలాగ తయారుచేయాలని ప్రభుత్వం అభిప్రాయ పడుతుండేది. ఇతనికి కోపంరేగి ఒళ్ళు మండుకుపోయింది. దద్దమ్మలాగ చేతులు ముడుచుకొని కూర్చొని దారుణ నిర్బంధచర్యలను సహిస్తుండటం ఇతని జన్మములో లేదు. మద్రాసు జైలు అధికారులకూ, పోలీసులకు ఆజన్మాంతం స్మరణకు వచ్చేటట్లు ఇతను ఘోరాడాడు. ఇది సహించలేక జైలు అధికారులు మహావీరుణ్ణి యినుపబండ కొకదానికి కట్టేశారు. ఒంటిమీద బట్టలన్నీ చింపి దూరంగా పారేశా మొండిమొల చేశారు. తర్వాత బెత్తాలు తీసికొని నిరుదుల క్రింది ప్రదేశంలో వరిచిపారేశారు. రక్తబిందువులు ధారగా కారినాయి. చిన్నచిన్న మాంసపు కండలు బెత్తాలకు చుట్టుకొని వచ్చాయి. అయినా మహావీరసింహు, బెత్తంతో దెబ్బ కొట్టినప్పుడెల్లా—సింహంలాగా— "లాంగ్ లీవ్ రివల్యూషన్" (విప్లవం వర్ధిల్లుగాక) అని గర్జనలు చేస్తుండేవాడు. ఆ యినుప బండకు వెనుకప్రక్కన కాంగ్రెసు సత్యాగ్రహోద్యమంలో శిక్షింపబడ్డ రాజకీయ ఖైదీల నందరినీ బలవంతాన తీసికొనివచ్చి కూర్చోపెట్టారు. వాళ్ళందరకూ కూడా భయం కల్గించాలనే ప్రభుత్వం యీపని చేసింది. కాని ఆనాడు మహావీరుడు నేర్పిన ఆపాఠము ఈ సత్యాగ్రహ ఖైదీలమనస్సులను కదల్చి పారేసింది. వీరిలో విప్లవ భావాలు రేకెత్తినాయి. తాముకూడా తిరుగుబాటు చేసి యీబ్రిటిషు ప్రభుత్వాన్ని పాతిపెట్టాలనుకొన్నారు. బహుశ - దీనిఫలితమే ననుకుంటా మద్రాసు కుట్రకేసు. విప్లవభావ పూరితులైన ఆనాటి జైలులోని మన మద్రాసు యువకులందరూ - ఈనాటికి కూడా మహా వీరుడంటే మంచి ఆదరమూ, భక్తి, ప్రేమా చూపిస్తుంటారు.

## అండమాన్ జీవితం

1933 ప్రారంభంలో మద్రాసు ప్రభుత్వం గాబరాపడి మహావీరసింహునీ, అతని సహచరులనూ అండమాన్లకు పంపించింది. భారతదేశానికి 800 మైళ్ల దూరంలో బంగాళాఖాతం మధ్య ఉన్న ఆ ద్వీపమూ, ఆద్వీపంలో "భారత విప్లకారుల గోరీలను తయారుచేస్తున్న" ఆపెద్ద ఎత్తైన గోడలమధ్యనున్న భయంకర కారాగృహమూ తలచుకొంటే - అబ్బ - గుండె పగిలిపోతుంది. 1921 లో కార్య్యాకమిటీ యీ అనారోగ్యస్థలాన్ని నిర్ణయించి ఇక్కడకు భారతీయ ఖైదీలనందరినీ బలవంతాన పంపించి బంధింపచేసే టందుకు ఏర్పాటు చేసింది.

1933 లో యీ అండమానులకే బ్రిటిషు ప్రభుత్వం భారతరాజకీయ ఖైదీలను బలవంతాన పంపించింది. అక్కడ ప్రభుత్వం యీ ఖైదీలను పశువులకంటే కూడా హీనంగా చూస్తుండేది. అక్కడగాలీ, నీళ్ళూ సరిపడేవి కాదు. ఉంటానికి యిరుకైన చీకటికొట్లు ఉండేవి. ఆగదుల్లో ఎప్పుడూ చెమ్మ, దుర్గంధమూ భరించ శక్యం కాకుండా ఉండేవి. రాత్రిపూట దీపం ఉండేదికాదు. అక్కడ తఱచుగా నేలమీద పాములూ పుట్రా తిరుగుతుండేవి. యీ నేలమీదే యీఖైదీలుపడి నిద్రపోయేవాళ్ళు. తింటానికి రొట్టెలిస్తే వాట్లో రాళ్ళూ పురుగుల్లూ ఉండేవి. అన్నం తిందామా అంటే నోట్లో పెట్టుకోటానికి కూడా వీలులేనంత వెధవాసన వేస్తుండేది. పగలంతా కష్టపడి పని చేసినా సాయంత్రం మళ్ళీ తనిఖీ ఉండేది. అంతకఠినంగా పనులు ఉండేవన్నమాట. ఉత్తరాలూ, పత్రికలూ బంద్. ఎవళ్ళన్నా వస్తే చూడటానికి వీల్లేదు. పుస్తకాలమీద సి. ఐ. డీల సెన్సారు ఉండేది. యీ ఖైదీల జీవనం అతి నికృష్టంగా ఉండేది. ఎప్పటికప్పుడు చావు దగ్గర కొచ్చేది. స్థానికాధికారులకు విన్నవించుకున్నారు. ప్రభుత్వానికి మొరపెట్టుకున్నారు. కాని ఫలితంసున్నా. చివరకు గతిలేక ఖైదీలు నిరశనవ్రతం సాగించారు. అధికారులు వీచాతినీచంగా ప్రవర్తించారు. ఈ ఖైదీలనెంత కష్టపెట్టిందీ—ఎలాంటి బీభత్సమైనపనులు చేసిందీ తలుచుకుంటేనే గుండెలు నీరవుతుంది. నిరశనవ్రతం పూనినవాళ్ళనందరినీ రాత్రింబగళ్లు వరుసనే తెరిచారు. పదిపండ్రెండు మందిపఠాను ఖైదీలు లోపలికెళ్లి—ఏకాకిగా ఉన్న ఆ రాజకీయ ఖైదీని—నిర్దయతో క్రౌర్యంగా నేలమీద ఎత్తి కుదవేసేవాళ్లు. కాళ్లూ, చేతులూ, పొట్టా అన్నీ నొక్కేశేవాళ్లు. డాక్టర్లు ముక్కుగుండా రబ్బరుగొట్టాన్ని దూర్చి దాని గెరాటుగుండా పాలు పోశేవాళ్లు. రెండోగదికి వెళ్లేవాళ్లు. అక్కడా యీ ఘాతుకకృత్యాలే చేశేవాళ్లు. నిరశనవ్రతం పూనిన ఐదోరోజున — ఆరాక్షసులు—మహా వీరసింహుని నేలమీద ఎత్తికుదవేసి నొక్కిపెట్టారు. డాక్టర్లు ముక్కుగుండా రబ్బరు గొట్టాన్ని శ్వాసనాళాల్లో దూర్చారు. మహావీరుడు గిలగిలా కొట్టుకున్నాడు. కాని— ఆపఠానుల ఉక్కుచేతులు ఇతనిని కదలనీయలా. డాక్టరులు ఆగొట్టంయొక్క గెరాటు నిండా పాలునింపారు. మహావీరుని నిశ్వాసనాళం పగిలిపోయింది. అంతే.......

జైలులోని ఆరాక్షసులు గప్‌చిప్‌గా డోలీ మీద తీసుకొనిపోయారు. రాత్రిపూట—గాఢాంధకారంలో-నలుగురు మనుష్యులు ఆ శవాన్ని తీసికొని జైలు ద్వారంగుండా బయటకువచ్చారు. ఎదురుగుండా దగ్గరలోనే అవర్‌డేన్ సముద్ర తరంగాలు టపటపాయిస్తున్నాయి. నలువైపులా నిశ్శబ్దంగా ఉంది. మహావీరసింహుని ఎప్పుడు తమలో కలుపుకొని పవిత్రమౌదామా అని! తరంగాలు ఎగిరెగిరి పడుతూ స్వాగతమిస్తున్నాయి. ఆ నిశ్శబ్దంలో — ఆ వీర యువకుని శవము—ఆసముద్ర గర్భంలో............రెండో రోజున కామ్రేడ్ మోహనకిశోర్, మూడో రోజున కామ్రేడ్ మోహిత మైత్రాకూడా— ఆ సముద్ర గర్భంలోనే మహావీరసింహునికి జత వెళ్లారు. ఈవార్తలు వినగానే కళ్ళవెంబడి నీళ్ళు తిరిగిపోయాయి. జతీన్‌దాసుని లాహోరు బోర్స్టలు జైలులో ఇలాగే పోగొట్టుకున్నాము. భగత్సింగు, సుఖదేవు, రాజగురులను లాహోరు జైలులో ఉరి తీయించుకున్నాము. చంద్రశేఖర అజాద్‌ని అలహాబాదులోని ఆల్ఫ్రెడు పార్కులో వీరస్వర్గానికి పంపించుకున్నాము. ఇప్పుడో— మన మహావీరసింహాన్ని సముద్రుని పొట్ట పెట్టుకున్నాము.

యీ వీరులందరూ భారత స్వాతంత్ర్యం కోసం, బ్రిటిషు సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని కూల్చడం కోసమేకదా బ్రిటిషు ప్రభుత్వం చేతుల్లో బలి అయారు.

చాలరోజుల తర్వాత అండమానులో నిరశన వ్రతం పూర్తి అయిపోయింది. ఆ వీర స్వర్గమనుభవించిన మహావీరసింహుని నోట్ బుక్కు ఒకటి అతని సహచరుని కొకనికి దొరికింది. దాంట్లో మొదటి పేజీలోనే అతనికి అతి ప్రియమైన చక్కని గీతమొకటి ఉంది. అతని విప్లవ జీవితాన్ని తెలిసికొనే టందుకు యీ గీతం చాలమట్టుకు తోడ్పడుతుంది.

అణచిపెట్టి యధికారము నముపునట్టి
వారిపైన దిరుగబడెను వారికొఱకు
ఎదురుచూచుచు మరణమెప్పుడ
ఎరుగుదును కాని......
నా కదృష్టములేదు—భవిష్యత్తు సున్న

* ★ *

ఎప్పుడైనను ఎచ్చటనైనగాని
కొందఱసువుల బలి యివ్వఁటుండగానె
ఊరకనె స్వాతంత్ర్యంబు ఊడిపడునె

..........................................................

* ★ *

"హృదయమును జీల్చి పూజలర్పించుకొందు
ఎదురుకొందును కష్టములెన్నియైన
అవసరంబగునేని ప్రాణములనిత్తు
మాతృదేశపు దాస్యంబు మాపుకొఱకు."

# లేఖినీ!!

(బి. వి. శేషయ్య.)

౧

లేఖినీ! విజయలేఖినీ!

అమిత సౌఖ్యమార్గాన్వేషకులగు
రాజరాజుల రాజాజుల;
అసూర్యంపశ్యలయి అటమటించె
అమిత సౌఖ్యం బనుభవించే
వారల సందర్యాల్ని వర్ణించిన
లేఖినీ!

విసుగుదలయే పుట్టదేదా? నీవు
ఏవగింపుతో సుడివడలేదా?
తమ సౌఖ్యం తమ స్వార్థం మునచి
తమ కష్టంబంతను దారవోసి;
ఆకలిమంటను అటమటించే
అధిక దైన్యం బనుభవించే
బీదవారల ఆకలి మంటను
బీదవారల పేదతనాన్ని
లేఖినీ!
వ్రాయలేవా? వర్ణించగలేవా?

౨

నేల నడచుచు పాదంబందున
నెత్తురు జిందగ నివ్వెరపడెడి
సోమరిపోతుల గేహోరామల
సకలకల్యాణాలకు మూలవిఘాతుకు
శాంతిని దాంతిని సమస్తలోకపు
సామరస్యమును వర్ణించుటకే
లేఖినీ!
సిగ్గుపడవా? విసుగు జనింపవా?
కాయకష్టం కడుపు మంటతో
గంపెడు సంతాన సమృద్ధితో
అణగిపోయి నిరీహుడగుచును
బ్రతుకుచుండిన కష్టజీవిలో
శాంతిని దాంతిని సమస్తలోకపు
కల్యాణాలను గాంచుటలేవా?
లేఖినీ!
నీవని వర్ణించవా?
నీవని తెలియజేయవా?

౩

స్వోదరపోషణ జీవితంబునను
సోపానంబని పొనుగు వారల
సౌఖ్యంచూడక నొత్తును ద్రొంగిలి
కష్టజీవులను కష్టపెట్టెడి
మానవత్వం నశించినవారిని
వ్రాయుకుమెపుడూ! వర్ణించకుమెపుడూ!
లేఖినీ! విజయలేఖినీ!
తనకున్నను లేకున్ననుకూడా
తన రక్తమును పిండి పండించుచు
భూతంబుల సంతృప్తి పరచెడు
పుణ్యమూర్తులు స్వార్థత్యాగులై
"లోకాధారుల లోకప్రభువుల"ని
చాటుమిప్పుడే లోకమంతటను
లేఖినీ! విజయలేఖినీ!

# మద్రాసు రాష్ట్రంలో కొత్త పన్నులు

కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య

కాంగ్రెసు మంత్రివర్గాలు, మద్యపాన నిషేధము, రైతాంగానికి పన్నుల రిమిషను, ప్రజోపకరములగు తదితర పనులు గావించడానికి పూనుకొన్నారు. దేశములో ఆదాయము వచ్చు పన్నులలో ఎక్కువ భాగము ఇండియా ప్రభుత్వము చేతిలో ఉంది వచ్చిన ఆదాయములో చాలభాగమును ఇండియా ప్రభుత్వము, బ్రిటిషు సైనికుల క్రింద ఖర్చుపెట్టుతూఉంది. అందుచే రాష్ట్రప్రభుత్వాలు, ముఖ్యముగా కాంగ్రెసు మంత్రివర్గాలు, తమ ప్రజోపకరములగు కార్యాలకు క్రొత్తపన్నులు విధించవలసి వస్తూఉంది. ఈసంవత్సరము ప్రతిరాష్ట్రములో ఇట్టి పన్నులు విధించారు. ఈవ్యాసములో మద్రాసు కాంగ్రెసు మంత్రివర్గము విధించిన క్రొత్తపన్నులు, వాని సాధక బాధకాలు, అవి ప్రజాసామాన్యంపై ఏవిధంగా పడేదీ చూస్తాము.

మద్రాసు మంత్రివర్గము, క్రొత్తగా అయిదు పన్నులు వేసింది. (1) పెట్రోలు మీద పన్ను (2) విద్యుచ్ఛక్తిపై పన్ను (3) వినోదాలమీద పన్ను (4) పొగాకుపన్ను (5) అమ్మకముపై పన్ను.

## పెట్రోలు పన్ను.

పెట్రోలుగాని, డీసల్ నూనెగాని, క్రూడ్ ఆయిల్‌గాని ఏవస్తువుకైనా ఉపయోగించుకోడానికి అమ్మితే ప్రతి గాలను పెట్రోలుమీద అణాన్నర పన్ను ఆ దుకాణదారుడు కట్టాలి. డీసల్ ఆయిల్, క్రూడ్‌ఆయిల్‌మీద అర్ధణా కట్టాలి. ఒక పెద్దవర్తకుడు మరియొక చిన్న వర్తకునికి, తిరిగి అమ్ముకోడానికి పెట్రోలును గాని, మిగిలిన ఆయిల్సుగాని అమ్మితే, అట్టి ఆయిల్ అమ్మకముపై పన్నులేదు. ఈపన్ను కిరసనాయిల్, రాక్షసిబొగ్గు, కొయ్యబొగ్గుమీద లేదు. నెలనెలకు పన్ను కట్టాలి.

పెట్రోలు కొనేవారు సామూలుగా ధనవంతులే అయిఉంటారు. వర్తకుడు గాలను అమ్మకానికి తాను ప్రభుత్వానికి ఇచ్చుకోవాలసిన అణాన్నరను పూర్తిగా పెట్రోలు కొనేవారివద్ద నుండి వెలబు హెచ్చించి వసూలు చేస్తాడు. ప్రజలకు బాధ్యత వహించని ఇండియా ప్రభుత్వము పెట్రోలుమీద గాలనుకు పది అణాలు పన్ను వేస్తున్నది. ఇంకొక ఒకటిన్నరణా రాష్ట్ర ప్రభుత్వాలకు ప్రజా మంత్రి వర్గాలకు, ప్రజోపకరములగు పనులు చేయడానికి ధనవంతు లిచ్చుకోవడము న్యాయమే.

ప్రతి పెట్రోలు వర్తకుడు తాను పెట్రోలు వర్తకుడని రిజిస్టరు చేయించుకోవాలి. పీకందరూ, ప్రతినెలా తమవద్ద ఎంత పెట్రోలు ఉన్నదీ, ఎంత అమ్మినదీ లెక్కలు వ్రాసి జిల్లా కలెక్టరుకు పంపుకోవాలి. ఆలా చేయకపోయినా, లేక కట్టవలసిన పన్నును నియమిత కాలములో కట్టకపోయినా, 1000 రూపాయల వరకు జరిమానా వేయవచ్చు. అప్పటికీ కట్టకపోతే, రోజుకు 50 రూపాయలు వరకు జరిమానా తప్పు దిద్దుకొనేవరకు వేయవచ్చు. ఈచట్టానికి వ్యతిరేకంగా పెట్రోలును అమ్ముతూఉంటే దానిని ప్రభుత్వము లాక్కోవచ్చు. (జాప్తుచేయవచ్చు.)

## విద్యుచ్ఛక్తి పన్ను

సంవత్సరానికి 2 లక్షల యూనిట్లకు పైగా విద్యుచ్ఛక్తిని (యూనిట్ అంటే అది విద్యుచ్ఛక్తిని కొలవడానికి ఉపయోగించే ఒకకొలత) అమ్మే కంపెనీలు పన్ను కట్టు కోవాలి. ఈ 2 లక్షల యూనిట్లు ఏ ఖరీదుకు అమ్మినా లెక్కలోకి వస్తుంది. మొత్తము అమ్మకము ఎన్ని యూనిట్లో మాత్రము చూస్తారు. దీనిని బట్టి పెద్ద కంపెనీల మీద వేయబడ లేదు.

ఈ పెద్ద కంపెనీలయినా తాము రెండణాలకు గాని, రెండణాలకన్న తక్కువకు గాని, అమ్మిన యూనిట్లపై పన్ను ఏమీ చెల్లించ నవసరము లేదు. రెండణాలకన్న ఎక్కువఖరీదుకు అమ్మితేనే ఆ విధంగా అమ్మిన ప్రతి యూనిట్‌కు అర్ధణా చొప్పున, పన్ను కట్టుకోవాలి.

కంపెనీలకు లైసెన్సు లిచ్చే టప్పుడు యూనిట్‌ను ఎంత కమ్మవలసినదీ నిర్ణయించి యుంటుంది. కాబట్టి ఈ పన్నును విద్యుచ్ఛక్తిని కొనేవారిపై కంపెనీలు వెయలేవు.

కాని కొన్ని పరిస్థితులలో కొంతవరకు గాని పూర్తిగా గాని పన్నును విద్యుచ్ఛక్తి కొనేవారిపై కంపెనీలు వసూలు చేయడానికి ప్రభుత్వం ఒప్పుకుంటే వీలుంటుందని ఒక క్లాజు చట్టములో పెట్టింది. ఏ దైనా కంపెనీకి నష్టము వస్తూ ఉండదని ప్రభుత్వమునకు నమ్మకము కల్గితే అట్లప్పుడు పన్నును విద్యుచ్ఛక్తిని కొనేవారినుండి కంపెనీలు వసూలు చేసుకోడానికి ఈ క్లాజు ఉద్దేశించ బడిందని ప్రభుత్వము చెప్పింది. లెక్కలను తారుమారుచేసి నష్టము వస్తున్నట్లు కంపెనీలు చూపడము, ఆరీతిగా పన్నును విద్యుచ్ఛక్తిని కొనేవారిపై త్రోయడం వీలవుతుంది. ప్రభుత్వము కంపెనీ లెక్కలను చాల జాగ్రత్తగా కనిపెట్టి చూడవలసి ఉంటుంది.

తక్కువ ఖరీదుకుఅమ్ము (రెండణాలలోపు) విద్యుచ్ఛక్తిపై పన్నులేదు కాబట్టి, పన్నును బాగా తీసుకొని వర్తకులు ఎక్కువ ఖరీదుకు అమ్ముటకు లైసెన్సు తీసుకోడానికి త్వరపడరు.

పన్ను నెలనెలకు కట్టాలి. నెలకు 16,666 యూనిట్లకు తగ్గకుండా ఒక నెల అమ్మితే ఆ నెలకు పన్ను మరుచటి నెలలో కట్టుకోవలసి వస్తుంది. ఒక నెలలో అంతకన్న తక్కువ అమ్మినా, సంవత్సరము ఆఖరికి 2 లక్షల యూనిట్ల కన్న ఎక్కువ అమ్మినట్లయితే, తక్కువగా అమ్మిన నెలకు కూడ పన్ను కట్టుకోవాలసి వస్తుంది.

విద్యుచ్ఛక్తి అమ్మే కంపెనీలు లెక్కలు వ్రాస్తూ ఉండాలి, ప్రభుత్వము తన ఇన్సెక్టరును పంపి పరీక్షించవచ్చు. లెక్కలు వ్రాయకపోయినా, ప్రభుత్వానికి ప్రతి నెలా లెక్కలు పంపకపోయినా రు 50 ల వరకు జరిమానా విధించవచ్చును. ప్రభుత్వము పన్నును వసూలు చేయడానికి ఇన్ని షరత్తులు పెట్టింది కాని మూడవ క్లాజులో, మూడవ సబ్ క్లాజులో ఒకరు ఒక లైసెన్సుకన్న ఎక్కువలైసెన్సులు కలిగి ఉంటే ప్రతి లైసెన్సుమీద వేరువేరుగా పన్నులు వేయబడుతాయి అని ఉంది. దీని మూలాన 2 లక్షల యూనిట్లకన్న ఎక్కువ అమ్ము కంపెనీలు తమ పరిశ్రమ కంతకు చిన్న చిన్న కంపెనీలుగా విభజించి లైసెన్సులు పొందడానికి ప్రయత్నించవచ్చు. దీని నుండి తప్పించుకోడానికి ప్రయత్నించవచ్చు. అలా జరగకుండా ప్రభుత్వము జాగ్రత్తగా ఉండాలి.

## వినోదాలపై పన్ను.

1926 నుండి మ్యునిసిపాలిటీలు వినోదాలమీద పన్ను వేస్తూ ఉండేవి. ఇప్పుడు, ఈ వినోదాలమీద పన్నును కేవలము మ్యునిసిపాలిటీలలోనే గాక, రాష్ట్ర మంతటా వసూలుచేస్తారు. టూరింగు సినిమాలు గ్రామాలలో ప్రదర్శించినా, నాటకాలు గ్రామాలలో వేసినా ఇప్పుడు పన్ను కట్టుకోవాలి.

వినోదము అంటే ప్రదర్శనములు; అవి వస్తు ప్రదర్శనాలు కావచ్చు లేక సంగీత ప్రదర్శనాలు కావచ్చు. నాటకము, సినిమాల్లాంటి వినోదాలు, ఆటలు, పందెములు. యివి డబ్బు తీసుకొని, మనుష్యులను రానిచ్చినప్పుడే పన్ను ఇచ్చుకోవలసి ఉంటుంది.

అయితే ఈ పన్ను వినోదమునుండిమైనా, ఖర్చులుకూడ మినహాయించక వసూలు అయిన పూర్తి డబ్బును, మత సంబంధమైన పనులకు లేక దాన ధర్మాలకు ఇచ్చినట్లయితే, చెల్లించ నవసరము లేదు. (2) కేవలము విద్యా సంబంధంగా ఒక ప్రదర్శనము ఉండినప్పుడుకూడ పన్ను చెల్లించనవసరము లేదు. (3) విద్యావ్యాపకము కోసంగాని, శాస్త్రజ్ఞాన వ్యాపకం కోసం గాని లేక విజ్ఞాన వ్యాప్తికోసంగాని, లాభాలు సంపాదించు నుద్దేశముతో నడుపబడని సంస్థలు ప్రదర్శించినపుడు కూడ పన్ను చెల్లించ నవసరము లేదు. (4) అట్టి సంస్థలే ప్రజారోగ్యము కోసంగాని, వ్యవసాయాభివృద్ధికోసంగాని అట్టి వస్తువుల ప్రదర్శనము గావించినపుడు కూడ పన్ను ఇవ్వ నవసరము లేదు (5) అంతేగాక ప్రభుత్వము ఏ ప్రదర్శనము వినోదముపైనైనా పన్ను వేయక మానివేయవచ్చు.

అమ్మే ప్రతి టిక్కెట్టుమీద పన్ను వేయబడుతుంది.

పన్ను ఈ క్రింది తీరున వసూలు చేయబడుతుంది.

1. 0-2-0 రూ.లకు మించనపుడు 0-0-3 పన్ను
2. 0-2-0 లకు మించి 0-6-0 కు లోపు 0-0-6 పన్ను
3. 0-6-0 నుండి 0-12-0 కు లోపు 0-1-0 పన్ను
4. 0-12-0 నుండి 1-8-0 కు లోపు 0-2-0 పన్ను
5. 1-8-0 „ 2-8-0 కు లోపు 0-4-0 „
6. 2-8-0 „ 3-8-0 కు లోపు 0-8-0 „
7. 3-8-0 „ 4-8-0 కు లోపు 0-12-0 „
8. 4-8-0 „ 6-8-0 కు లోపు 1-0-0 „
9. 6-8-0 „ 9-8-0 కు లోపు 1-8-0 „
10. 9-8-0 „ 10-0-0 కు లోపు 2-0-0 „
11. 10 రూ. లకు మించినపుడు ప్రతి 10 రూ. లకుగాని, దానిలో ఒక భాగానికిగాని 2-0-0 పన్ను

ఈ పన్నును సులభంగా వసూలు చేయడానికి ప్రతి ప్రొప్రయిటరు లేక మేనేజరు ప్రభుత్వ స్టాంపుఉన్న టిక్కెట్లనే అమ్మవలయునని శాసించింది. లేక ప్రభుత్వపు అనుమతిమీద మొత్తం ఎంతమంది వచ్చినదీ తెలియచేసే యంత్రము ద్వారానైనా టిక్కెట్లు ఇవ్వాలి. లేదా ప్రతి ప్రదర్శనమునకు, ప్రభుత్వమునకు ఒక నిర్ణీత మొత్తమునుగాని లేక వసూలైన మొత్తములో ఖర్చులు మినహాయించకుండా నూటికి ఇన్నివంతులనిగాని, ప్రభుత్వము నిర్ణయించినట్లు చెల్లించవచ్చు.

మేనేజర్లు, ప్రొప్రయిటర్లు ప్రభుత్వ నిబంధనల ననుసరిస్తున్నదీ లేనిదీ తనిఖీచేయడానికి ప్రభుత్వము ఇన్స్పెక్టర్లను నియమిస్తుంది. వీరిని అడ్డగించినా, నిర్ణీతసమయములో పన్ను కట్టకపోయినా, ప్రభుత్వ స్టాంపుఉన్న టిక్కెట్లు అమ్మకపోయినా లేక ప్రభుత్వము అంగీకరిస్తే ఎంతమంది వచ్చినదీ తెలియజేసే యంత్రమునైనా ఉపయోగించకపోతే; 500 రూపాయల వరకు జరిమానా, పన్నుకాక విధించవచ్చు.

స్థానిక సంస్థలకు గత మూడు సంవత్సరాల లెక్కలను బట్టి రమారమి సంవత్సరమునకు ఎంత వస్తూ ఉండినదో అంతడబ్బు ప్రభుత్వము ఇప్పుడు, ఈ పన్ను వసూళ్ళ నుండి తిరిగి యిస్తుంది.

ముందటి చట్టంలో 4 అణాలకు మించకపోతే పన్ను ఉండేదికాదు. ఇప్పుడు రెండణాల లోపు కూడ పన్ను ఇచ్చుకోవాలి. ఇది నిజంగా కాసేపు అయినా ఆనందాన్ని, వినోదాన్ని పొందడానికి ప్రయత్నించే బీద ప్రజలమీద పన్ను వేయడమన్న మాట. ఇది మాత్రము వేసియుండవలసినదిగాదు. కనీసము రెండణాల లోపు టిక్కెట్లనయినా పన్ను క్రిందకు రాకుండ మినహాయించవలసినది. మద్రాసులాంటి నగరాలలో రేడియో ఉన్న అనేక కేంద్రాలలో ప్రజల వినోదార్ధము, బహిరంగ స్థలములలో బ్రాడ్‌కాస్టింగు సంగీతాన్ని వినడానికి ఏర్పాట్లు చేస్తూ ఉన్న సమయములో, మరికొన్ని వినోదాల కోసం, బీద ప్రజలపై పన్ను వేయవలసినది కాదు.

## పొగాకు మీద పన్ను

ఈ పన్ను పొగాకును ఇతరులకు అమ్మడానికి భారి తరఫున కొనడానికి బేరాలు కంట్రాక్టులు చేయు బ్రోకర్లు, కమిషను ఏజంట్లు (దళార్లు) వీరి మీద విధించబడుతుంది.

పొగాకును, పొగాకుచే తయారుచేయబడిన వస్తువులనుగాని టోకుగా అమ్మేవారిమీదకూడ పన్నువేయబడుతుంది.

అదేవిధంగా చిల్లరగా అమ్మేవానిమీదకూడ పన్నువేయబడుతుంది.

పొగాకునుకొని సిగరెట్టులుగాగాని బీడీలుగాగాని చుట్టలుగా గాని ముక్కుకు పనికివచ్చే పొగాకుగాగాని ముక్కుపొడిగాగాని తయారు చేసే వ్యక్తి (పరిశ్రమాధికారి) కూడ పన్ను చెల్లించుకోవాలి.

కాని మద్రాసురాష్ట్రములో న్యాయంగా పనిచేసిగాని తన కుటుంబమువారితో కలసి పనిచేసిగాని, లేక కూలీలను పెట్టుకొనిగాని, లేక



కౌలుకిచ్చిగాని, పొగాకును పండించినవారు, అంటే రైతులు ఈపన్ను చెల్లించనవసరము లేదు. అతడు దీనిని ఎట్టి పన్ను లైసెన్సు లేకుండ, ఆకును పదును చేసినవిమ్మటకూడ అమ్ముకోవచ్చు. అయితే"మద్రాసురాష్ట్రములో" అనే పదాలుండడమునలన పుదుక్కోట, మైసూరు, హైదరాబాదు, తిరువన్కూరు, కొచ్చిన్, మొదలగు సంస్థానాలలో గాని, యానాం, పుదుచ్చేరీలాంటి బ్రిటిషువారికి చెందని ప్రాంతాలలోగాని, మద్రాసు రాష్ట్రీవు రైతులే పొగాకును పండించినా, దానిపై పన్ను వేయడానికి ప్రభుత్వానికి వీలుంటుంది. అది ఎలా చేస్తుందనేవిషయము, అసలు అట్టిపన్ను వారిపైకూడ పన్నువేస్తామనిగాని ప్రభుత్వము ఇంతవరకు చెప్పలేదు. కాని తమకున్న రూల్సు చేసే అధికారాన్ని పురస్కరించుకొని వేయవచ్చు.మద్రాసురాష్ట్రములోని రైతులు ఎచ్చటపండించినా, పొగాకుపైన పన్నువేయ నేకూడదు.

పొగాకు రైతులేగాక, పెద్దపెద్ద కంపెనీలు సాహుకార్లు విదేశస్థులుకూడ కేవలము వర్తకము కొరకు, లాభదృష్టితో, అనేకవేలయకరములు కౌలుకు తీసుకొనో, లేక స్వయముగా కొనో పొగాకును పండిస్తున్నారు. అట్టివారిపై పన్ను వేయకుండడములో అర్ధములేదు. పొగాకును పండించే పెద్దపెద్ద సాహుకార్లపై పన్ను వేయవలసివస్తే, ప్రత్యేకంగా పొగాకును పండించే వారినందరిని రిజిస్టరు చేయడమో, లేక లైసెన్సు లివ్వడమో చేయాలసి వస్తుంది. పైగా వారికి పొగాకు పంటవలన వచ్చే ఆదాయమును గూర్చిగాని, వారు సాగు చేసే విస్తీర్ణము గూర్చిగాని లెక్కలు కూడ కావలసి ఉంటాయి. ఇది అంతా బిల్లును చాల క్లిష్టము చేస్తుందనే ఉద్దేశముతో మానివేసి ఉండవచ్చు. కాని పొగాకుమీద ఈ బిల్లులో ముందు చూపెట్టినట్లు ఎక్కువ పన్నులు వేస్తున్నప్పుడు, పొగాకు పంటపై ఎక్కువ ఆదాయము పొందే ధనికులపై పన్ను వేయకపోవడము న్యాయముకాదు. అందు ముఖ్యంగా టీ, కాఫీలలాగ, చాలమందికి పొగాకు అవసరమయి పోయినప్పుడు, బీద ప్రజలలో దాదాపు అందరికికూడ ఇది అలవాటయిపోయినపుడు, కేవలము పొగాకు పన్నుఅంతా వారిమీదనే వేయడము అన్యాయముగా కనపడుతుంది. ప్రభుత్వము త్వరలో వ్యవసాయమునుండివచ్చే ఎక్కువ ఆదాయాలమీద పన్ను వేయడానికి పూనుకొని, బీదలపై భారముగ పడే పన్నులను తగ్గించాలి.

చిన్న రైతులు కలసి సహకారసంఘాన్ని ఏర్పాటుచేసుకొని పొగాకు పండించిన నప్పటికీ, వారిపై ప్రస్తుతపు చట్టముప్రకారము పన్ను పడుతుంది.ఇదికూడ అన్యాయమేనని చెప్పకతప్పదు. వీనిపై పన్నువేయనిచో ఒకవేళ ధనికరైతులు సాహుకార్లు, ఈ సహకారసంఘముల చట్టము నవకాశముగా తీసుకొని పన్నుతమపైపడకుండా తప్పించుకుంటారని వాదించవచ్చును. అపరిస్థితులలో 1932 సహకారసంఘముల రిజిస్ట్రేషను ఆక్టును, సాహుకార్లు పొగాకు ఉత్పత్తికోసం వినియోగించకుండా, నిబంధనలు చేయవలయును. లేదా మార్చవలయును. అలా చేయనిచో సహకారసంఘములయొక్క ఉద్దేశానికే భంగం కలుగుతుంది.

1913 ఇండియను కంపెనీల ఆక్టుక్రింద రిజిస్టరు చేయబడిన కంపెనీలమీద పన్నువేయడము సరియైన పనియే.

## పన్ను ఎలా వేయబడుతుంది?

అమ్మకముపై పన్ను, వర్తకులకు ఇచ్చు లైసెన్సులకు వసూలుచేయు ఫీ, ఈ రెండు విధాల ప్రభుత్వము పొగాకుపైపన్ను వేస్తూ ఉంది.

### లైసెన్సు రుసుములు.

టోకు వ్యాపారస్థుడు, పరిశ్రమాధికారి, బ్రోకరు, (దళారీ) కలెక్టరునద్దనుండి లైసెన్సు పొందనిదే పొగాకు వర్తకము చేయకూడదు.

టోకు వ్యాపారస్థుడు, పరిశ్రమాధికారి; బ్రోకరు చిల్లరవర్తకునికో, లేక పరిశ్రమాధికారికో లేక మరి యొక టోకువర్తకునికో పొగాకు అమ్మాలి. అంతేగాని తాము స్వయముగా ప్రజలు వాడుకోడానికి చిల్లరగా అమ్మకూడదు. అలా అమ్మాలంటే మరియొక లైసెన్సుపొందాలి. ఈ లైసెన్సు చిల్లరవర్తలందరూ తీసుకోవాలి. అయితే చిల్లరవర్తకానికి కావలసిన ఈ లైసెన్సులకు ఎంతడబ్బు కట్టవలసినదీ చట్టములోలేదు. కాన లైసెన్సు ఉచితంగా ఇస్తారో లేక కొంత రుసుము తీసుకొనిఇస్తారో ప్రభుత్వము ఇష్టముమీద ఉంటుంది. చిల్లరవర్తకులు తమ పొగాకు అమ్మకమును బట్టి పన్నువేరే చెల్లించవలసి యుండుటచే లైసెన్సులకు తిరిగి ఫీ (రుసుము) చెల్లించుకోవాలనడము చిల్లరవర్తకులకు నష్టము కలిగిస్తుంది. ప్రభుత్వము ఆలాచేయదనే తలుస్తాను.

ఒక వర్తకునికి, ఒక పట్టణములో గాని, లేక వేరువేరు పట్టణాలలోగాని, వేరు వేరు పొగాకు దుకాణాలుంటే, ప్రతి దుకాణానికీ లైసెన్సు పొందాలని వేరొక నియమమంది. ప్రతిలైసెన్సుకు రుసుము కట్టాలంటే ఇది చాల కష్టము. కట్టుకోవలసిన వారిలో చాల అసంతృప్తిని కలిగిస్తుందనికూడ ప్రభుత్వము గుర్తించాలి.

ఈ లాంటి లైసెన్సు లేకుండ పొగాకును ఆకుగా ఉత్పత్తి చేసిన రైతు అమ్ముకోవచ్చును. పొగాకును పదునుచేసినా, లైసెన్సు గాని, పన్నుగాని రైతు కట్ట నవసరము లేదని తెలియచేయబడింది. కాని పదును చేయడము రైతేచేయాలని ఉంది. అనేక స్థలాలలో అనేకమంది బీదరైతులు తమ ఆకును పదును చేయుటకు కావలసిన బేరన్లు నిర్మించుకోలేక, దగ్గర ఉండు ధనిక రైతుల బేరన్లలోనే అద్దె యిచ్చుకొని చేయించుకుంటారు. అలా పదును చేయబడిన ఆకును రైతు అమ్మితే అది వర్తకము చేసినట్లు బిల్లులో అర్ధము రావచ్చును. అందుచేత దానిపై పన్ను వేయవచ్చు. కాని పన్ను వేసే పక్షాన రైతులందరూ సేస్తూ పొగాకును పదునుచేయకుండా అమ్మనందున రైతులందరిపై ఈ పన్ను పడుతుంది. అందుచే యా పన్ను వేయకూడదు.

ఇప్పుడు అనేకమంది రైతులు బేరన్లను స్థాపించి ఇరుగుపొరుగువారి ఆకును కొని తాముపండించిన ఆకుతోపాటు పదును చేసి అమ్ముతారు వారిపైకూడ ఈ పన్ను పడుతుంది. ఎందుకంటే, పొగాకును పదును చేయుట పొగాకు పరిశ్రమలో ఒక భాగం ఆ లాంటి వారు పండించిన దానిపై తేసేస్తే పన్నుండవలసినగాని ఇంకొకరైతులు అలా చేసినపుడు అప్పుడతడు టోకువర్తకుడౌతాడు దీనితో తాను పండించిన పొగాకుకూడ పన్ను కట్టుకోవాలసి వస్తుంది. లేదా బీద రైతుల పొగాకు తాను కొనకుండ ఉండవలసి ఉంటుంది. పదునుచేయకుండవలసి ఉంటుంది. ఆ పరిస్థితులలో తమ ఆకుకు సరియైన ధర రావడానికి పదునుచేయడము, టోకుగా అమ్మడానికి బీద రైతులు సహకార సంఘాన్ని స్థాపించుకోవలసి ఉంటుంది. వానిమీదకూడ పన్ను ఇప్పుడు వేసి యుండడమువలన, రైతు నష్టపడకమానడు అందుచే ప్రభుత్వము నిజంగా రైతులపై భారం పడకుండ ఉండడానికి కనీసము రెండు పనులు చేయాలి. (1) సహకార సంఘాలమీద పన్ను వేయకూడదు. (2) రైతులు అద్దెకిచ్చి పదును చేయించుకొన్నా, వారిపై పన్నుగాని, పదును చేసిన బేరన్ల యజమానులపై ఆలా పదును చేసినందులకు పన్నుగాని,వేయకూడదు.

### లైసెన్సు రుసుములు

టోకు వ్యాపారస్తుడు, పరిశ్రమాధికారి, బ్రోకరు, ఈక్రింది విధంగా లైసెన్సు రుసుము ఇచ్చుకోవాలి.

### టోకు పొగాకు వ్యాపారస్తుడు

పదునుచేసిన పొగాకునుగాని, పదునుచేయని పొగాకుగాని, పరిశ్రమలో వినియోగించడానికి వీలగునట్లు కొంతవరకు తయారు చేయబడిన పొగాకునుగాని, వర్తకానికోసం కొన్నను, అమ్మినను టోకు వ్యాపారస్థులకు బీడీ,చుట్టలు వగైరా తయారుచేయనివారికి, వానిలో వ్యాపారము లేనివారికి 100 రూపాయలు లైసెన్సురుసుము. అయితే సంవత్సరానికి వీరి అమ్మకము 3000 రూ.లకు మించిఉంటేనే 100 రూ.లు ఇచ్చుకోవాలి.

2. 1000 రూ.ల లోపు అమ్మకమున్న ఈలాంటి వర్తకులు కేవలము సంవత్సరానికి 5 రూ.లు లైసెన్సు రుసుము కట్టితేచాలు.

3. 1000 రూ.లు మొదలు 3000 రూ.ల వరకు అమ్మకము ఉన్నచో సం 10 రూ. లు లైసెన్సు రుసుము కట్టితేచాలు.

కాని 3000 రూపాయలకు తక్కువగా ఆకును అమ్మే వర్తకులు చాల తక్కువగా ఉంటారు. అందుచే ఈరకపు వర్తకులలో ఎక్కువమంది 100 రూ. లు లైసెన్సురుసుము చెల్లించుకోవాలి.

### టోకు వ్యాపారస్తుడు

పైన చెప్పబడినట్టి వారుగాక, ఇతర రకముల టోకువ్యాపారస్థులకు, వారు బీడీ చుట్టలు వగైరా తయారు చేయనివారైఉంటే, సంవత్సరానికి రూ 50 లు లైసెన్సు రుసుము ఇచ్చుకోవాలి

### పరిశ్రమాధికారి.

ఫ్యాక్టరీ ఆక్టు క్రిందకు వచ్చేటట్టి లేక వర్తింప జేయబడ్డ ఫ్యాక్టరీలో 200 మంది కార్మికులనుగాని అంతకు పైగాగాని పెట్టుకొని బీడీలు వగైరా తయారుచేయునతడు వానిలో వ్యాపారముచేయకుంటే 100 రూ లు లైసెన్సు ఫీ ఇచ్చుకోవాలి.

ఫ్యాక్టరీ ఆక్టు క్రిందికివచ్చి, లేక వర్తింప జేయబడి 200 మందికన్న తక్కువమంది పని చేస్తూఉంటే, బీడీ చుట్ట వగైరాలలో వ్యాపారము చేయకుంటే సంవత్సరానికి 50 రూ. లు లైసెన్సు ఫీ ఇచ్చుకోవాలి.

ఫ్యాక్టరీ ఆక్టు క్రిందికి రాకపోయినను, ఫ్యాక్టరీ ఆక్టును వర్తింపజేయకపోయినను, అట్టి పరిశ్రమాధికారుకు సంవత్సరానికి లైసెన్సుఫీ 21 రూ. లు ఇచ్చుకోవాలి.

బీడీ, చుట్ట, ముక్కుపొడి, వగైరాలలోకూడ టోకు వ్యాపారముచేసి అమ్మకము పన్ను కట్టేవాళ్ళయితే, వారికి సంవత్సరానికి పది రూపాయలు మాత్రమే లైసెన్సు పన్నుగాని పైనచెప్పిన రుసుములు కావు.

### బ్రోకరులకు (దళారీలకు)

వీరు సంవత్సరానికి 50 రూ. లు లైసెన్సు రుసుము చెల్లించాలి.

### అమ్మకపు పన్ను.

బీడీలు, చుట్టలు, సిగరెట్టులు, ముక్కుపొడి, హుక్కా, సిగరెట్టులలో ఉపయోగించునట్లు చేయబడిన పొగాకు వగైరాలను టోకుగా అమ్మిన టోకు వ్యాపారస్థులకు సంవత్సరానికి తమ మొత్తము అమ్మకములో నూటికి రెండు రూపాయల ఎంతున పన్ను చెల్లించాలి. అయితే 1000 రూపాయల ఖరీదులోపల ఇట్టి వస్తువులను టోకు వ్యాపారస్థుల కోసము తయారు చేసేవారు ఇట్టి పన్ను కట్టుకోనవసరం లేదు.

### చిల్లరవర్తకులు

వీరు ఈ క్రిందిరీతిని పన్ను చెల్లించాలి.

సంవత్సరానికి 100 రూ. లకు మించని అమ్మకముగలవారికి పన్ను 6 రూ.లు.

సంవత్సరానికి 100 రూ. లకు మించి 200 రూ. మించనిచో పన్ను 15 రూ

సం॥కి 200 రూ. లు మించి 500 రూ.లు మించనిచో పన్ను 30 రూ

సం॥కి 500 రూ. లు మించినచో పన్ను అమ్మిన సరుకుకు ప్రతి 100 రూ. లకు 10 రూ.

చాలమందికి పొగాకుభోజనముకన్న అవసరమయిపోయింది. అందుచే పొగాకు వస్తువులు ఎంత ఖరీదైనా కొనితీరుతారు. అందుచే ఈ పన్నును పొగాకును వాడుకొనేవారివద్దనుండే వర్తకుడు వసూలుచేసుకొంటాడు.

ఈ పన్ను విధించిన పద్ధతి చిన్నవర్తకులకు కొంత నష్టమే కలిగిస్తూఉంది. ఈ రేట్లుకన్న సరాసరి అమ్మకముపై నూటికి పదిరూపాయలు పన్ను అని ఉంటే ఇంతకన్న స్పష్టంగా ఉండేది.

నూటికి రు. 10 లు రేటు అని నిర్ణయిస్తే వర్తకులు లెక్కలు వ్రాయాలని వస్తుందని కొందరు వాదించవచ్చు. కాని ఇప్పుడు సూచించిన రేట్లకైనా లెక్కలు వ్రాయక తప్పదు. ఎందుకంటే అమ్మకము రు. 10 లకు మించలేదని గాని, రు. 20 లకు మించలేదని గాని లేక రు. 500 లకు మించలేదని గాని రుజువు చేసుకోడానికి లెక్కలు వ్రాయక తప్పదు కదా.

## కలెక్టరులకు విపరీతాధికారాలు

ఈ చట్టముక్రింద ఇవ్వవలసిన పన్నుగాని లైసెన్సు రుసుముగాని చెల్లించని పక్షమునూ ఈ లెక్కలను నిర్ణయించిన రీతిని వ్రాయకపోయినను; లైసెన్సులోని షరతులకు భిన్నముగా నడచినను; లైసెన్సులను రద్దుచేయుటకు కలెక్టరుకు అధికారమివ్వబడింది. చట్టము అంతటితో ఆగలేదు. ఏ రవెన్యూ చట్టాన్ని ఉల్లంఘించినట్లు రుజువైనా, లైసెన్సు రద్దుచేయబడుతుంది మరియే యితర పన్నో చెల్లించలేదనే కారణంచేత జీవనోపాధికి ముఖ్యముగా ఈ పని చేసుకోలేకపోతే అలా చేసుకోనివ్వక లైసెన్సు ఇవ్వకపోవడము చాల పొరపాటు. అంతేగాక

ఏ పీనల్ చట్టంక్రింద శిక్షింపబడినా లైసెన్సు రద్దుచేయబడును. రాజకీయ నేరాలకు శిక్షింపబడినా ఇదేగతి పట్టుతుంది కదా! ఒకవేళ రాజకీయ నేరములకు గాక, మామూలు ఏదో క్రిమినల్ నేరమునకు శిక్షించబడినను, వానికి జీవనోపాధికి మార్గము లేకుండ చేయడం ఆధునిక శిక్షాస్మృతికే వ్యతిరేకమని చెప్పక తప్పదు.

లైసెన్సులో లైసెన్సును ఇష్టము వచ్చినప్పుడు కలెక్టరు రద్దుచేయవచ్చునని షరత్తు ఉంటే రద్దుచేయవచ్చునట. అట్టి షరత్తు ఉంచవలసిన అవసరమేమీ కనపడదు. కలెక్టరు ఇష్టానిష్టములపైన లైసెన్సును రద్దుచేయడము ఎప్పటికీ పనికిరాదు.

ఈ అధికారాలుగాక వారంటులేని సోదాలు చేయడము అరెస్టులుచేయడము. ఈ చట్టాన్ని ఉల్లంఘించారని శిక్షచెప్పబడినపుడు ఆ నేరము తాలూకు సొమ్మును ప్రభుత్వము వశపరచుకోవడము మొదలగు అధికారాలుకూడ ఉన్నాయి. ఇవన్నీ విపరీతంగా కనపడకమానవు.

ఈ చట్టములోని నిబంధనలకు వ్యతిరేకముగా ఎవరయినా అమ్మితే, లేక లెక్కలు వ్రాయకపోతే, ప్రభుత్వానికి ఇవ్వవలసినపన్ను ఇవ్వక మోసపుచ్చి తప్పించుకొనుచుంటే, వేయి రూపాయల జరిమానా అప్పటికీ సరిదిద్దుకోకుంటే ప్రతిరోజుకు మరియొక 50 రూపాయల జరిమానా విధించడానికి ప్రభుత్వానికి అధికారమున్నప్పుడు పై పేరాలోని అధికారాలు అనవసరము.

ఈ చట్టము అమలుజరుపుటకు నియమించబడే ఉద్యోగస్థులను ఎవరయినా వ్యతిరేకిస్తే వారికి మూడునెలలు జెయిలుగాని; లేక 500 రూ.ల వరకు జరిమానాగాని లేక రెండునుగాని విధింపవచ్చునను మరియొక క్లాజు ఉన్నది.

అట్టిచో కలెక్టరు ఇష్టము వచ్చినప్పుడు లైసెన్సు రద్దుచేసే అధికారము, వారంటులేకనే సోదాలు, అరెస్టులు చేసే అధికారము కేవలము అనవసరమని మరియొక పర్యాయము చెప్పక తప్పదు.

* * *

## అమ్మకాల పన్ను

మొట్టమొదట ఈ చట్టాన్ని తెచ్చినప్పుడు ఇది అమ్మకములమీద పన్నుగా ఉండినది. కాని సెలెక్టుకమిటీలో కొన్ని వస్తువులను కొన్నవారిపై ఈపన్ను వేయుటకు వీలుండునట్లు మార్పు చేయబడింది. ఈ వస్తువులు ముఖ్యంగా ఎగుమతి వ్యాపారానికి సంబంధించినవిగా ఉంటాయి.

### రైతులకు మినహాయింపు.

ఈపన్ను రైతులు తమ వ్యవసాయక ఫలితములను, తాముగాని, తమ పాలేర్లచేతగాని, కౌలుదార్ల చేతగాని పండించినచో వానిని అమ్మినప్పుడు పన్ను చెల్లించనవసరములేదు. వడ్లు వ్యవసాయ దినుసులలోకి వస్తాయి. అవడ్లను బియ్యముగా మార్చి, రైతే మద్రాసుకు లేక ఇతర పట్టణాలకు ఇతర దేశాలకు పంపి అమ్మినచో, అట్టి బియ్యముపై పన్ను ఉంటుందా? ఉండకూడదు. అలా ఉంటే, రైతుకు చాల దెబ్బతగులుతుంది. మధ్యనున్న దళారీ చేతులలో చిక్కుపడిపోతాడు. ఎందుకంటే దళారీలు, దుకాణదారులు, తాము ప్రభుత్వానికి మధ్య కట్టవలసిన పన్నులను మినహాయించుకొనియే రైతుకు మిగిలిన ఖరీదు ఇవ్వడానికి తయారవుతారు. ఆ పరిస్థితినుండి బయటపడడానికి రైతులు తమ ధాన్యాలను ఎగుమతి చేసుకోడానికి అవకాశముండాలి. తమలో తాము కట్టుబాటు చేసుకొని, స్వతంత్రంగా డైరెక్టుగా (సరాసరి) ప్రజలకే అమ్మడానికి పూనుకోవలసి ఉంటుంది. దానికి అవసరమయితే సహకార సంఘాలుకూడ ఏర్పాటు చేసుకోవలసి ఉంటుంది. అలా చేసుకొనకపోతే, రైతు మధ్య దళారీలు, దుకాణదారులు చెప్పిన ఖరీదుకే తమ ధాన్యాన్ని అమ్ముకోవలసి వస్తుంది. ఈదృక్పథంతో ఈ పన్ను సహకార సంఘాల మీద విధించడముకూడ పొరపాటని చెప్పక తప్పదు.

### కొన్ని వస్తువులను మినహాయించకూడదు.

ఈవరకే ఇతర మద్రాసు చట్టాల క్రింద పన్ను వేయబడినవస్తువులపై ఈ క్రొత్తపన్ను కట్టుకో నవసరము లేదు. ప్రత్తిపైనా, నూలుపైనా, చేతి మగ్గాలమీద తయారయిన బట్టపైనా కేవలము ఆ బట్టనే అమ్మే వర్తకు లమ్మినచో దానిపైనకూడ ఈ పన్ను చెల్లించ నవసరము లేదు.

ఈ క్రొత్త పన్ను బంగారము, వెండి అమ్మకముపై లేదు. షేరు మార్కెట్టులలో తరచు అమ్మబడుతూ ఉన్న షేర్లు, సెక్యూరిటీ, స్టాకులపై పన్ను లేదు. మొదటి బిల్లులో వీనిపై కూడ పన్నువేయడానికి ప్రభుత్వానికి అధికారముండినది. ఇప్పుడు వీనిని ఈ పన్ను నుండి మినహాయించడము, ధనవంతులు, సాహుకార్లు చేసిన ఆందోళనకులొంగిపోవడమే కాని వేరేమి కాదు. ముఖ్యంగా ఈ పన్ను మధ్య తరగతికి చెందిన అనేకమంది చిన్న దుకాణ దారులపైనా, సగానికి సగము పన్ను వరకు ప్రజాసామాన్యము మీదా, పడుతూ ఉన్నప్పుడు, ధనికులపై పడకుండా మినహాయించడము ఏ మాత్రము సమంజసము కాదు.

రాష్ట్రము బయటకు ఎగుమతిచేసే వస్తువులపైకూడ పన్ను ఉంటుంది. కాని మన రాష్ట్రములో పరిశ్రమాగారాలలో తయారై పూర్తియైన వస్తువులను బయటకు ఎగుమతి చేస్తే ఆవస్తువుల అమ్మకముపై చట్టక్రింద వేయబడిన పన్నులో సగము డిస్కౌంటు ఇస్తారు;

తోళ్ళ పైనను, పదునుచేయబడిన తోళ్ళవస్తువులపైనను ఒకసారి మాత్రము పన్ను వేస్తారు. అంతే మిగిలిన వస్తువులన్నిటిలోను వర్తకము చేసేవారందరూ అమ్మినప్పుడెల్లా పన్నుకట్టవలసి వుంటుంది. ఒకవస్తువును మద్రాసులో ఒక వర్తకుడు అమ్మాడు. దానిని బెజవాడలో మరియొకడు వ్యాపారస్థుడు కొనితిరిగి మరియొక చిల్లరదుకాణదారునికి అమ్మాడు; ఆ చిల్లర దుకాణదారుడు ప్రజలకు అమ్మితాడు. ఇప్పుడు అవస్తువు మూడుసారులు అమ్మబడింది. ఈ చట్టముక్రింద అవస్తువుపై మూడుసార్లు అమ్మకపుపన్ను చెల్లించాలి. అంటే అమ్మినప్పుడల్లా పన్నుకట్టాలి. కాని తోళ్ళ సామగ్రిమీద మాత్రము ఈ మూడు స్థానాలలో ఎప్పుడనో ఒక పర్యాయము మాత్రమే పన్నుకట్టాలి; ఒక పర్యాయము కట్టితే తిరిగి వానిని ఎవరికి అమ్మినా మరల పన్నుకట్ట నవసరములేదు.

### పన్ను రేటు : వసూలు చేయుట.

సంవత్సరానికి పదివేల రూపాయలకు మించకుండా, ఇరవైవేల రూపాయల లోపుగా, అమ్మకము చేసేవారు నెలకు ఐదు రూపాయల వంతున సంవత్సరానికి అరవై రూపాయలు పన్ను కట్టుకోవాలి. ఇరవై వేల రూపాయలకు మించి అమ్మకము చేసేవారు వారి మొత్తము అమ్మకముపై నూటికి 0-8-0 యా వంతున పన్ను చెల్లించాలి.

ఒక తాలూకాలోనే వర్తకము చేసేటట్లయితే ఒక వర్తకుడు ఎంత పన్ను కట్టవలసినదీ ఆ తహసీల్దారు నిర్ణయిస్తారు. రివిన్యూ డివిజనులో చేస్తే డివిజనల్ ఆఫీసరు. జిల్లాలో అంతటా చేస్తే రివిన్యూ బోర్డుచే నియమింపబడిన జిల్లా కలెక్టరు - వీరు వర్తకుల లెక్కలను దావాపు ఇన్కంటాక్సుకువలెనే పరిశీలించి నిర్ణయిస్తారు.

వర్తకులు లెక్కలు సకాలంలో చూపించకపోయినా, పన్ను సకాలములో చెల్లించలేకపోయినా, దుకాణదారు కొట్లను, లెక్కలను తనిఖీ చేయడానికి పంపబడిన ఇనస్పెక్టరులకు అడ్డు తగిలినా, మరియే యితరవిధంగా నైనా ఈ చట్ట నియమాలకు వ్యతిరేకముగా నడచినా వేయి రూపాయలవరకు జరిమానా వేయవచ్చు. అప్పటికీ సరి దిద్దుకొననిచో, సరిదిద్దుకొనక గడచిపోతూ ఉన్న ప్రతి రోజుకూ రు 50 లు జరిమానా అదనంగా వేయవచ్చు.

### పన్నుకు కొన్ని అభ్యంతరాలు.

వర్తకులైనా ఈపన్నును తమ లాభాలను తగ్గించుకొని కట్టుకోవలసి ఉంటుంది. లేదా తమ లాభాలను యథావిధిగ ఉంచుకోవాలంటే, వస్తువుల వెలలను ఎక్కువచేసి అమ్మవలసి యుంటుంది. వర్తకులు తమ లాభాలను పోగొట్టుకోడానికి తయారుకారు. అందుచే వెలలు ఎక్కువచేస్తారు. కాని, నాలుగైదు పర్యాయాలు అమ్మినప్పుడల్లా కట్టిన పన్ను నంతను వస్తువు ఖరీదుమీద వేస్తే వస్తువుల ఖరీదు చాల ఎక్కువగుతుంది. ఖరీదు మరీ హెచ్చితే కొనుగోలు బాగా పడిపోవచ్చు. అందుచే మరీ ఎక్కువ ఖరీదుకు తక్కువ సరకును అమ్మితే వచ్చేలాభముకన్న, కొంచెము తక్కువ ఖరీదుకే ఎక్కువగా అమ్మకము జరిగినపుడు వచ్చిన లాభము ఎక్కువగా ఉండవచ్చును. ఆ పరిస్థితులలో వర్తకుడు కొంత పన్ను తాను కూడ భరించి, మిగిలినదే వస్తువులను కొనువారి నుండి వెలలు ఎక్కువచేసి వసూలుచేస్తారు.

అందుచే పన్ను పూర్తిగా వర్తకుడే భరించుకోడు. లేక పూర్తిగా కొనుక్కొనే ప్రజలే భరించరు. ఇద్దరు భరిస్తారు. కాని సంఘటన గల్గి, ఆర్థిక శక్తిగలిగిన ధనిక వర్తకులు. సాధ్యమైనంతవరకు ఈ పన్నును ఇతులపై రుద్దడానికి ప్రయత్నిస్తారు. అందుచే ఈపన్నును ధనికులు కొద్దిగను, పేదలు ఎక్కువగను ఇచ్చుకోవాలసిన గతి పట్టవచ్చు.

ఈ పన్నును వర్తకులు కూడ కొంతవరకు చెల్లించుకోవలసి ఉంటుంది కాబట్టే వర్తకులు, దీనికి వ్యతిరేకంగా ఇంత తీవ్రంగా ఆందోళన చేస్తున్నారు. వస్తువులను చౌకగా అమ్మాలంటే ప్రజలకు చిల్లరగా అమ్మడానికిముందు, మధ్య ఎంత తక్కువ మందిగుండా అమ్ముడైవస్తే అంత మంచిది. అందుచే చిల్లర వర్తకులు కూడ పోటీమూలాన తిన్నగా ఉత్పత్తిదారుల నుండిగాని, లేక ఒకే టోకు వర్తకుని నుండిగాని కొనడానికి ప్రయత్నిస్తారు దీనిలో మధ్య దుకాణదారుల సంఖ్య తగ్గకమానదు. వారి అవసరము లేకుండకూడ పోవచ్చు.

పెద్ద వర్తకులు తామే చిన్న చిన్న దుకాణాలు పట్టణాలలోను, పల్లెలలోను, ఏర్పాటుచేసి (డైరెక్టుగా) తిన్నగా ప్రజలకు మధ్య మరెట్టి దుకాణదారులతో అవసరములేకనే అమ్ముట కేర్పాటులుచేయవచ్చు. తాము ఉత్పత్తిదారుల నుండే తిన్నగా సామగ్రిని కొంటారు. పెద్ద వర్తకుల ఈపోటీకి చిల్లరదుకాణదారులు ఆగలేక తమ దుకాణాలను మూసిపెట్టాలిసివస్తుంది. కొంతమందికి పెద్ద దుకాణదారులవద్ద గుమాస్తాలుగ పనిదొరికినా ఎక్కువమంది నిరుద్యోగులు కాక తప్పదు.

పరిశ్రమలలోకూడ ఒక పరిశ్రమకు కావలసిన వస్తువులను అపరిశ్రమాధికారి వివిధపరిశ్రమాధికారులనుండి కొనక, తానే ఉత్పత్తి చేయుటకు పూనుకొనవచ్చును. దీని మూలంగా దేశములో మొనాపలీలు త్వరగా వృద్ధిచెంది అనేకమందికి పనిలేకుండ చేయవచ్చు.

వేరేమి వృత్తిలేనప్పుడు, ప్రభుత్వము పని చూపించలేనప్పుడు ఎంతోమందిని నిరుద్యోగులుగా చేయడము నిరుద్యోగులకెట్టి సహాయమిదిని కూడ ఏర్పాటుచేయనప్పుడు ఏమాత్రము న్యాయముకాదు. అంగీకరించతగినదికాదు.

సంవత్సరానికి 10 వేల రూపాయిల అమ్మకమంటే రోజుకు సుమారు 27-8-0 లు అమ్మకముచేసేవారందరిపై ఈపన్ను పడుతుంది.

ఎక్కువ ఖరీదులకు అమ్మినా చిల్లర దుకాణదారునికి రూపాయికి అణాకన్నలాభముండదు. అంతకన్న మిగలదు. అంటే సంవత్సరానికి 10 వేల అణాలు లేక 625 రూపాయలు ఆదాయము వచ్చేవారు రు. 60 లు ప్రభుత్వానికి పన్ను చెల్లించాలి. ఈ రు. 60 లలో ఏమాత్రము కూడ వస్తువులను కొనుక్కొనేవారిపై చిల్లర దుకాణదారుడు రుద్దజాలడని చెప్పవచ్చు. ఈ విధంగా చిన్న చిన్న దుకాణ దారులపై ఇంత పన్ను వేయడము అవసరమా? వేయడము మంచిదికూడ కాదనే నా అభిప్రాయము.





# నాల్గవ కృష్ణాజిల్లా రైతు మహాసభ

16-4-39 వ తేదీని కాజ గ్రామంలో సమావేశమయిన నాల్గవ కృష్ణాజిల్లా రైతు మహాసభకు శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణ మూర్తిగారు ప్రారంభోత్సవము గావిస్తూ ఈ క్రిందివిధంగా చెప్పిరి.

## ప్రారంభోపన్యాసం

రైతు సోదరులారా!

అందరము రైతులము; పంటలు పండించుతాము. పలుచోట్ల పస్తే దాని ఫలితముగా నున్నది. కారణం ఏమి? మన పంటను మనం అనుభవింపకుండ చేయుచున్న వారెవరు? సామ్రాజ్య ప్రభుత్వము, దానికి అన్నివిధముల అండయగు జమీందార్లు, షాహుకార్లు ముఖ్యులనుట నిర్వివాదాంశము. కావున మన దారిద్ర్యము పోయి కడుపునిండా తిండి, కట్టుబట్ట, సుభద్రమయిన యిల్లు పొందవలయుననిన పైన దెలిపిన త్రివిధశక్తులను ఎదుర్కొని వారిదాడి నుండి విముక్తి బడయ కృషి చేయుటయే మన కర్తవ్యము. మన కర్తవ్య సాధనమందు జయము పొందవలయుననిన మనలోని ప్రతి స్త్రీ పురుష రైతు దీక్షాబద్ధులై సంఘశక్తిని పెంపొందించుకోవలయును. అట్టి అసంతిత దీక్షావ్రతమే మనకు అవసర కరణ్యము. మన దారిద్ర్య దాస్య జీవన విమోచన మార్గము

నేడు భారత దేశమున ఏ రాష్ట్రములో చూచినను, ఏ మూల గాంచినను రైతులు చైతన్యత గలిగి సంఘములు, సభలు, యాత్రలు, దినోత్సవములు, వీటిద్వారా చేయుచున్న ఆందోళన, సలుపుచున్న కృషి, సాగించుచున్న పోరాటములు తమ శ్రమ ఫలితమగు పంటను తామనుభవించుటకు చేయుచున్న యత్నములే. ఏ వర్గమును దోచుకొనుటకు గాదనియు, ఏ వర్గముమీద ద్వేషాసూయ ప్రేరేపణవలన చేయబడుచున్న పనులు గావనియు సోదర దేశీయులందరు గ్రహింప గోరుచున్నాను.

### సత్యాగ్రహ పోరాటాలు.

కొన్ని ప్రదేశములలో సత్యాగ్రహములు సాగించవలసి వచ్చుచున్నది కాళీపట్టణ చరిత్ర గమనించండి. ఈ జిల్లాలో మునగాల జమీలో ప్రస్తుతమున్న ఎస్టేటు ల్యాండు ఆక్టును అనుసరించి రాష్ట్ర కాంగ్రెసు పెద్దలయిన శ్రీ గో॥ బ్రహ్మయ్యగారిచే తీర్పు యివ్వబడిన రాజీ షరతులను జమీందారుగారు అమలు జరుపుచుండుటలేదు. ఇక రైతులు ఏమి చెయ్యాలి? మునగాలలో సత్యాగ్రహం చేయవలసి వచ్చిన ఆశ్చర్యమేమి? రాష్ట్ర కాంగ్రెసుకమిటీ పెద్దలు, ప్రభుత్వ ఉద్యోగస్థులు తామందరు కలసిచేసిన సంధిపత్రమును జమీందారు ఉల్లంఘించుచున్నప్పుడు మిన్నకుందెదరా? వుండజాలరనియే నమ్ముచున్నాను.

సోదరులారా, ఒక్క విషయమును మరువకూడదు. దేశంలో జమీందారీ పద్ధతి యున్నంతవరకు మనము చైతన్యము గలిగి సంఘశక్తిని ప్రదర్శించి ఎదిరించనంత కాలము, ప్రకాశం కమిటీ నివేదిక లాభములను మనం సంపూర్ణముగా అనుభవించజాలము. ప్రస్తుతమున్న ఎస్టేటు ల్యాండు ఆక్టువల్లన గలుగు లాభములను అనుభవించుచుంటిమేమో? ఆలోచించండి. దాని లాభములను అనుభవింపలేకుంటిమి. ఈ విషయం కాదని ఏ జమీన్ రైతయినను చెప్పగలడా?

కాంగ్రెసు ప్రభుత్వములో పోలీసు లాఠీచార్జీలు, నిర్బంధములు, కాల్పులు, జైళ్ళలోని వార్డర్లు, అధికారుల నిరంకుశ నిర్బంధములు దారుణమగు ఇట్టి పనులు తొలగుటకు బదులు చెలరేగుచుండుటచే కాంగ్రెసు ప్రభుత్వ ప్రతిష్ఠకు, కాంగ్రెసు గౌరవమునకు, పలుకుబడికి భంగము వాటిల్లుచున్నది. వీటిని నిరోధించుట ప్రభుత్వ కర్తవ్యమని వేరుగ మనం చెప్పవలెనా?

### సంఘ నిర్మాణము.

ఇట్టి దురాగతములను అరికట్టుటకు ప్రభుత్వమువారు అవసరమగు విధానమును అవలంబించక పోవుటకు మన సంఘ నిర్మాణ మందుగల లోపములు కారణము లనవచ్చును.

సంఘమునకు ద్వివిధబలముండాలి. ఒకటి బాహ్యబలము. 2. నిర్మాణయుక్తమగు నిర్వాహణబలములేక అంతర్బలము. బాహ్యబలమంటే వేలకొలది సభ్యులను చేర్పించుట. శాఖాసంఘముల నేర్పాటు చేయడము వగును. మనం అట్టి బలాన్ని మాత్రం చేకూర్చుకున్నాం చేకూర్చుకోగలుగు చున్నాము. కాని వాటిని కార్యనిర్వహణ మొనర్పదగిన సంఘములుగ తయారుచేసుకొనుటయందు అశ్రద్ధచూపుచు వెనుకబడి యుంటిమని అంగీకరింపక తప్పదు. ఈ విషయమును కాంగ్రెసు రైతుసంఘములవారు ముఖ్యంగా గుర్తించాలి. ఏమన మన ఆశయ సిద్ధికి మూలబలమీ ప్రాథమిక సంఘములే. సంఘములు మనకు ప్రయోజనకరముగా నుండవలెనన్న ఏమికావాలి? ఏమిచేయాలి? ఆలోచించుదము. ప్రతి ఒక్క రైతు సంఘమునందు తానొక భాగస్వామిననుభావం కలిగియుండాలి. సుశిక్షణతో కూడిన ప్రచారకులు, బాధ్యతను నిర్వర్తింపవలెనని వ్యసనమొందుసంఘసభ్యులు కార్యసాధనకు నిరంతరము సేవచేయ నభిలషించు కార్యవర్గసభ్యులు, సంఘనిర్మాణయుక్తముగ పనిచేయుట కవసరమగు ధనము, కావలయును. ధనం అనగానే దూరం వెళ్తాము. ముడుపులమ్మకుమాత్రం మ్రొక్కుచు ముడుపులు మూటకట్టి ముట్టచెప్పతాము. అనవసరవ్యయములకు డబ్బులేకపోయినా సమయానికి పుట్టించుకుంటాము. సంఘములకు డబ్బు యిచ్చుకో లేకుండా వున్నాము. గ్రామ సంఘం మొదలు రాష్ట్రసంఘం వరకు డబ్బులేక పనుల నిర్వర్తించుకొనుటకు అశక్తివంతములై వున్నవని అనుభవపూర్వకముగ విశదపడుచున్నాను. ఈ విషయమును ప్రతి రైతు గమనించాలని ప్రార్థించుచున్నాను. దానికి మార్గము సభవారు నిర్ణయించుతారని ఆశించుచున్నాను.

ప్రతి గ్రామమున వాలంటీరు దళములను నిర్మించుకొనాలి. వారికి అవసర శిక్షణాశిబిరములను ఏర్పాటుచేయాలి. ఫిర్కాకు ఒక వేతన ప్రచారకుని నియమించుకోవాలి. వేతన ప్రచారకులు, గౌరవప్రచారకులు యీ క్రింది విషయములను గమనించాలి. ప్రభుత్వము, జమీందారు, సాహుకార్లవల్లన రైతులకగుచున్న వివాదములందు తోడ్పడాలి. నీటి వసతులు, పంట అంచనాలు, భూమిలెక్కలు, కాలువల మరమ్మతులు, నీటిపంపకం ఏర్పాట్లు, రైతుల ఆదాయవ్యయములు, గ్రామ సహకార బ్యాంకులు, ఋణవాజీబోర్డుల వ్యవహారపరిశీలన మున్నగు పనులన్నిటియందును సంఘములు జోక్యము కలిగించుకొని వాటి యుపయోగములను రయితులు పొందులాగునచూడాలి. పైసంఘములకు ఎప్పుడు రిపోర్టులు బంపుచు పరస్పర ఉత్తర ప్రత్యుత్తరములతో సంఘ వ్యవహారములను నడుపుకొనుటయందు నేటి అశ్రద్ధపోవాలి. దినోత్సవములు జయప్రదంగా జరుపుట, పత్రికలుచదివి వినిపించుట, దేశంలో జరుగుచున్న పోరాటముల చరిత్రలను జనసామాన్యమున కెరుకపరచుట, మున్నగు పనులు నిర్వర్తించాలి.

### స్వాతంత్ర్య పోరాటము—మన కర్తవ్యం

ప్రపంచములో యుద్ధధ్వనులు ప్రతిధ్వనించుచున్నవి. స్వదేశ సంస్థానములందు స్వాతంత్ర్య పోరాటములు సాగుతున్నవి. మన ప్రభుత్వము మనల నింకను బానిసలుగచేయు. ఆ స్వతంత్రులుగనొనర్పు మన దరిద్రమునకు కారణమగు తమ దోపిడీకి భంగము వాటిల్లకుండునట్టి ఫెడరల్ ప్రభుత్వమును మన నెత్తిపై రుద్ద చూచుచున్నారు. మనం దానిని అసలే పనికిరాదంటూంటే యుద్ధంవస్తే ఎదురు తిరుగుతామని దానిలో పాల్గొనం అని దలచి, మన మంత్రులు ఎదురు తిరుగుదురని భావించి, "ఆపత్ సమయము" అను నెపమున రాష్ట్రమంత్రులసలహా సంప్రతింపులు లేకనే గవర్నరు జనరలు యింకను తన నిరంకుశ వర్తనమునకు అవసరమగు చట్ట సవరణలు బ్రిటిషు పార్లమెంటులో ఇటీవలనే ఆమోదింపబడినవి. వానిని మనం గమనించాలి. పరిస్థితులు, తరుణం వచ్చినప్పుడు యీ బ్రిటిషు ప్రభుత్వముతో పోరాడుటకు వెనుదీయమని వెల్లడించాలి. త్రిపురీ కాంగ్రెస్ జాతీయవాంఛా తీర్మానమును గురించి తీవ్రంగా ప్రచారపు ఏర్పాట్లు కావించాలి. ప్రతిరైతు జాతీయవాంఛ తన వాంఛగా భావించి తత్సాఫల్యత కొరకు చేయబడు కృషి క్షేత్రమున భాగస్వామికావాలి. భారత స్వాతంత్ర పోరాటమును సాగించుటకు తయారుకావాలి.

* * *

## అధ్యక్షోపన్యాసం

మహాసభకు అధ్యక్షత వహించిన శ్రీ పుల్లెల శ్యామసుందరరావుగారు ఈ క్రింది విధంగా ఉపన్యసించిరి.

ఆహ్వాన సంఘాధ్యక్షా, రైతు సోదరులారా!

బ్రిటిషు ప్రభుత్వానికి ప్రపంచ రాజకీయాలలో నానాటికీ పలుకుబడి, బలం చాలా క్షీణించుచున్నదనీ, మన భారతదేశ స్వాతంత్ర్య సంపాదనకు అంత్యపోరాటం సాగించాలంటే యింతకంటే మంచి తరుణం లభించదనీ, మన దేశనాయకు లనేకులు చెప్పుచున్నారు. రాబోయే స్వాతంత్ర్య పోరాటానికి రైతులు ముఖ్యంగా, ఆయత్తం కావాలనీ, కాంగ్రెసు మహాసంస్థకు చేదోడుగా రైతుసంఘాలు పనిచేయాలనీ మొన్నగయలో జరిగిన అఖిలభారత రైతు మహాసభలో తీర్మానించుటతో ఆ సభాధ్యక్షులైన ఆచార్య నరేంద్రదేవుగారు రైతు లందరిని హెచ్చరించారు.

### రైతులు-కాంగ్రెసు సామరస్యం.

రైతుసంఘాలకు కాంగ్రెసుకు ఉండవలసిన పరస్పర సంబంధము గురించి ఆయన ఈ విధంగా చెప్పారు.

"రైతు సంస్థలు కాంగ్రెసుతో పోటీపడరాదు. కాంగ్రెసుకంటె మిన్నకావాలనీ ఎక్కువ శక్తి సంపాదించి కాంగ్రెసును అణచి వెయ్యాలని ఉద్దేశించరాదు. రైతు సంస్థలు కాంగ్రెసు బలానికి ఉప బలంగా యుండాలి. కాంగ్రెసు రైతు సంస్థను త్రోసివేయకూడదు. ఎందుకంటె తమ హక్కులకోసం పాటుపడటానికి ధైర్యం, శక్తి సంపాదించుకొన్న రైతుండడమే కాంగ్రెసుకు బలం కలుగుతుంది. దేశ స్వాతంత్ర్య సంపాదనకోసం వెనుదీయకుండా పోట్లాడ కలుగుతుంది."

ఈవిధంగా రైతునాయకులు పదేపదే, కాంగ్రెసుపట్ల తమ అభిప్రాయాలను స్పష్టపరుస్తూ యున్నా, సంపూర్ణ సహకారాన్ని చూపుతూ యున్నా, రైతు నాయకులన్నా, సేవకులన్నా ప్రస్తుత అధికారమందున్న కాంగ్రెసు నాయకులనేకులకు అరికాలు మంట రైతుసంఘాలు ప్రత్యేకంగా స్థాపించడం అవసరం లేదని వారంటారు.

### కాంగ్రెసు ప్రభుత్వాలు — రైతులు, కార్మికులు.

అన్నిరాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు రైతుల కూలీల మేలు నుద్దేశించి కొన్ని శాసనాలు చేయడానికి ప్రారంభించాయి. రైతులపైనున్న ఋణవారం లేక శిస్తుభారం తగ్గించాలని ఆలోచించి, సాముదాయక భూములు, అడవులు, కొండలు, నదులు, జలాశ్రయములో గల హక్కులు రైతులకు సదుపాయంగా అన్వయింపజూచి నప్పుడు జమీందార్లు భూస్వాములు, ధనవంతులు, సాహుకార్లు లేనిపోని ఆందోళన చేయడం, దానితో కాంగ్రెసు ప్రభుత్వాలు బెదిరిపోవడం, మొదట అనుకొన్న ప్రకారం చట్టములు చేయలేకపోవడం, జమీందార్లతోను, సాహుకార్లతోను రాజీకి దిగడం, ఎందుకు ఎవరికి పనికిరాని చట్టాలు చివరికి చేయడం, అందువల్ల రైతులలో కాంగ్రెసుపట్ల అసంతృప్తి నిరాశ కలగడం జరుగుచున్నది.

కాంగ్రెసువారు రాజ్యభారం వహించినప్పటికి అధికారవర్గంలో హృదయ పరివర్తనం ఏమాత్రముకూడా కలగలేదన్న అంశం స్పష్టమవుతుంది. ప్రజాస్వామిక సిద్ధాంతాలకు వేరుగనున్న కాంగ్రెసు ప్రభుత్వం క్రింద పనిచేయు ప్రభుత్వోద్యోగుల అధికార దుర్వినియోగంవల్ల కాంగ్రెసు సంస్థకు అపతిష్ఠ వస్తూవున్నది.

లాఠీరాజ్యం రోజులలో విడిచిపెట్టిన పోలీసు గుర్రాల కళ్ళెములు యీనాటికైనా బిగదీసినట్లు లేదు. ఎక్కడికక్కడ జబరదస్తీలు జరుగుతున్నట్లు వార్తలు వస్తూనేయున్నవి. పైపెచ్చు కాంగ్రెసు కమిటీలు నిజమువిచారించి పైకి తెలియచేస్తే దరియాప్తు [illegible] కనబడనందున పోలీసు దుండగాలు మరీ హెచ్చయి పోతున్నవి. తమ దుర్మార్గతను [illegible] సాహసించిన కాంగ్రెసువారిపై [illegible] పోలీసువారు అన్యాయాలు చేస్తున్నట్లు అక్కడక్కడ [illegible]

(మిగతా 14 వ పేజీలో)

లలితా గురుచరణు లిద్దరూ ఆశ్చర్యంతో అతనివంక చూస్తూ వుండిపోయారు. గిరీనుడు సంకోచముతో చెప్పనారంభించాడు.

"చూడండి. ఇప్పుడు నాకు డబ్బుతో అంత అవసరంలేదు. మీకు వీలుగా వున్నప్పుడు తీర్చివేయవచ్చును. వారికి అవసరమని అంటున్నారు కాబట్టి——"

"పైకమంతా నువ్విస్తావా?" అని గురుచరణుడు మెల్లగా అడిగాడు.

"ఆ(, వారికి అవసరమయేటట్లయితే" అని, గిరీన్ తల వంచుకున్నాడు.

గురుచరణుడు ఏదో జవాబివ్వబోతూన్న సమయాన అన్నాకాళి పరిగెత్తుకుంటూ వచ్చి "ఒదినా! జల్దీ. శేఖరదా గుడ్డలువేసుకు రమ్మంటున్నాడు. నాటకం చూడడానికి పోవాలి!" అని మళ్లా వచ్చిన విధంగానే పరుగెత్తుకొంటూ వెళ్ళింది ఆ పిల్ల ఆదుర్దాచూసి గురుచరణుడు నవ్వాడు. లలిత తొణకకుండా కూర్చున్నది.

ఒక్క క్షణమున్నాక మరల అన్నాకాళీ వచ్చి "ఏదీ ఇంకా లేవనే లేదే? మేమంతా నిలబడివున్నాము!" అని అన్నది.

అయినా లలితలో లేచే లక్షణాలేవీ కనబడలేదు. ఈ సంభాషణ చివరివరకు వినాలనుకున్నది. కాని గురుచరణుడు కాళి ముఖంవంక చూసి మందహాసంచేసి లలిత తల నిరుముతూ "అయితే పో! తల్లీ! ఆలస్యము చేయకు. నీ కోసం అందరూ ఎదురు చూస్తున్నారట." అన్నాడు.

ఇక విధిలేక లలిత లేచింది. కాని వెళ్ళేముందు గిరీంద్రుని వంక కృతజ్ఞతతో చూసి మెల్లగా వెళ్ళిపోయింది. గిరీంద్రుడు అది గమనించాడు.

పది నిముషాలు గడచినాక గుడ్డలవీ వేసుకుని తమలపాకులు ఇవ్వాలనే నెపంతో లలిత మరోమాటు బయటగదిలోకి వచ్చింది. గిరీన్ అప్పటికి వెళ్ళిపోయాడు. గురుచరణుడు పడకకుర్చీలో కళ్లుమూసుకు పండుకొని ఉన్నాడు. అతని మూసిన కనుకొలకులనుండి నీరుకారుతూ వున్నది. అవి ఆనందాశ్రువులని లలిత గ్రహించి వారి ధ్యానభంగం చేయకుండా వచ్చిన విధంగానే నిశ్శబ్దంగా వెళ్ళిపోయింది.

కొంచెముసేపటికి ఆమె శేఖరుని గదిలో ప్రవేశించింది. అప్పటికి ఆమె కండ్లల్లోకూడా నీరు నిండింది. అక్కడ అన్నాకాళీలేదు. అందరికంటే ముందుగాపోయి బండిలో కూర్చున్నది. శేఖరుడు ఒక్కడే గదిలో నిలబడి ఉన్నాడు. బహుశా, లలిత కోసం ఎదురుచూస్తూ వున్నాడనుకుంటాను. తలఎత్తి కన్నీటితో బరువయిన లలిత నేత్రాలు చూశాడు.

ఈ వారం పదిరోజులనుంచి లలిత కనబడక పోవడంచేత శేఖరుడు లోలోపల చాలా విరక్తుడయినాడు. కాని ఇప్పుడు అది అంతా మరచి పోయి "అదేమిటి, ఏడుస్తున్నావా?" అని అడిగాడు.

లలిత లేదన్నట్లు తల విసుడుగా తిప్పింది.

కొన్ని దినాలనుంచి లలిత బొత్తుగా కనపడక పోవటంచేత శేఖరునిలో ఏదో మార్పు గలిగింది. అందుచేత అతను దగ్గరకువచ్చి లలిత రెండు చేతులూ పట్టుకొని ముఖం పైకెత్తి "నిజంగానే ఏడుస్తున్నావే! ఎందుకు?" అని ప్రశ్నించాడు.

లలిత ఇక తనను సంబాళించుకోలేక పోయింది. అక్కడే కూలబడి చెరగుతో ముఖం కప్పుకు భోరున ఏడ్చింది.

౬

నవీనరాయ్ వడ్డీ అసలు దమ్మిడీలతో సహా లెక్కకట్టి తీసుకుని తాకట్టు దస్తావేజు గురుచరణునికి ఇస్తూ "సరేకాని ఈ డబ్బు ఎక్కడిది తెచ్చావోయ్!" అని అడిగాడు.

"అది అడగబోకు అన్నయ్యా. చెప్పనని మాట యిచ్చాను" అన్నాడు గురుచరణుడు వినయంగా.

డబ్బువసూలు అయినందుకు నవీనుడికి ఏ మాత్రమూ సంతోషం కలుగలేదు. ఈ అప్పు వసూలవుతుందని అనుకోలేదు. ఇల్లు క్రయముకో వాలనే లెఖ్ఖలో ఉన్నాడు.

"ఇప్పుడు ఎన్ని మాటలైనా ఇస్తావు! అసలు, తప్పు నీదికాదు భాయీ, నాది. డబ్బుమళ్లీ అడగడమే తప్పు. లేకపోతే కలికాలం అని ఎందుకంటారు" అన్నాడు శ్లేషగా.

"అదేంమాట అన్నయ్యా! మీ ధనరుణం తీర్చానుగాని మీ దయా రుణం ఇంకా తీర్చనేలేదు." అన్నాడు గురుచరణుడు వ్యధితుడై.

నవీనుడు నవ్వాడు. ఇతను బోలెడు ప్రపంచం చూశాడు. ఇలాంటి మాటలు నమ్మినట్లయితే బెల్లం వ్యాపారములో ఇంత ధనమే సంపాయించేవాడు కాడు.

"భాయీ, నువ్వు నిజంగా అలా భావించినట్లయితే ఇలా అప్పు తీర్చేవాడివే కాదు. నాతప్పు ఏమున్నది. కొంత పైకం అడిగాను! అది కూడా నాకోసంకాదు: మీ ఒదినె కోసం. సరేకాని ఎంతవడ్డీకి ఇల్లుతాకట్టు పెట్టావు?"

"తాకట్టు పెట్టలేదు. వడ్డీసంగతి కూడా మాట్లాడుకో లేదు"

నవీనుడికి నమ్మకం కలగలేదు. "ఏమిటీ? చేబదులుగానే?" అని అడిగాడు.

"ఔను. అన్నయ్యా! ఒకవిధంగా అంతే. కుర్రవాడు చాలా మంచివాడు."

"కుర్రవాడా? ఏకుర్రవాడు"

గురుచరణుడు ఈప్రశ్నకు జవాబివ్వలేదు. ఈకాస్తా వెళ్ళబెట్టటమే తనది పొరపాటని గ్రహించాడు.

నవీనుడు అతని మనోభావాన్ని గుర్తించి మందహాసం చేస్తూ "నిషేధం ఉన్నపుడు చెప్పకుండా వుండడమే మంచిది. భాయీ! నేను అనుభవంమీద చెప్తుతున్నాను. కొంచెం జాగ్రత్తగా వుండటం ఎందుకైనా మంచిది. మంచికిపోయి ఆఖరికి మెడకు తెచ్చుకుంటావు." అన్నాడు.

గురుచరణుడు ఈ మాటకు జవాబియ్యకుండా నమస్కారం చేసి కాగితం చేతపట్టుకొని ఇంటికి వెళ్ళిపోయాడు.

భువనేశ్వరి అప్పుడప్పుడు కొంతకాలం పడమటకుపోయి వుండి వస్తూ ఉంటుంది. ఆమెకు అజీర్ణవ్యాధి. కాని అంత ప్రమాదకరమైనది కాదు. ఈ యాత్ర ఆమెకు ఉపయోగిస్తూ ఉండేది. నవీనుడు ఆనాడు తనపని సానుకూలం చేసుకోవటానికి ఈజబ్బును కొంచెం పెంచిచెప్పాడు. ఏకారణం చేతనైనా కానీయండి, ప్రయాణసన్నాహాలు మాత్రం జరుగుతున్నవి.

ఆవాళ ఉదయం శేఖరుడు సూటుకేసులో అవసరమైన ప్రయాణ సామగ్రిని పెట్టుతూ ఉండగా అన్నాకాళి గదిలోకివచ్చి "శేఖరదా! మీరు రేపేకాదూ వెళ్ళేది?" అని అడిగింది.

శేఖరుడు దృష్టి పెట్టెమీదనుంచి మరల్చి "కాళీ, మీ వదినెను ఒక మాటు పిలువు. వెంట ఏమేమి తీసుకుపోవాలో పెట్టెలో సర్దుతుంది," అన్నాడు.

"మావదినె ఈమాటురాదు" అన్నది కాళి తలతిప్పుతూ.

"ఎందుకు రాదు?"

"బాగా ఉంది! ఎలా వస్తుంది? మాఘ మాసంలో పెళ్ళి. నాన్న వరుణ్ణి వెదుకుతున్నాడుగా!"

శేఖరుడు స్తబ్ధుడై రెప్ప వాల్చకుండా చూస్తూ ఊరకున్నాడు.

కాళి వాళ్ళ యింట్లో విన్న సంగతులన్నీ గడగడ చెప్పనారంభించింది.

"ఎంత డబ్బయినా కానీ మంచి పాత్రను చూడమని గిరీన్‌బాబు చెప్పాడు! నాన్న ఇవ్వాళకూడా ఆఫీసుకు వెళ్ళడు. భోంచేశాక ఎక్కడికో కుర్రవాణ్ణి చూడటానికి పోతున్నాడు—వెంట గిరీన్‌బాబుగూడా పోతాడు."

శేఖరుడు స్థిరంగా కూర్చుని వింటున్నాడు. లలిత ఇప్పుడు రాకపోవటానికి కారణమేమిటో అతనికి తెలిసింది. ఇంతేకాదు. ఇంకా చాలా సంగతులుకూడా అతను ఊహించుకున్నాడు. కాళి ఇంకా చెప్పతూనే ఉన్నది.

"గిరీనుబాబు చాలా మంచివాడు శేఖరదా! అక్కయ్య పెళ్ళికి మా ఇల్లు పెదనాన్నకు తాకట్టు పెట్టాము; అదింకా రెండు మాసాలుదాకా తీర్చకపోతే మేము బజారులో బిచ్చమెత్తుక తిరగాల్సి వచ్చేదట! అందుకనే గిరీన్‌బాబు పైకము యిచ్చాడు. నిన్ననే నాన్న అప్పుతీర్చి వచ్చాడు. ఇక మా కేమీ భయములేదని ఒదినె అంటున్నది. నిజము కాదూ శేఖరదా."

# పరిణీత

## శరశ్చంద్రచటర్జీ

విరచితం

శేఖరుడు జవాబేమీ చెప్పలేక పోయాడు. అలానే చూస్తూ ఊరకున్నాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు శేఖరదా" అని కాళి అడిగింది.

ఈ మాటు శేఖరునికి కొంచెం స్పృహ వచ్చింది. తడబడుతూ "ఏమీ లేదే కాళీ! మీ వదిన్ని నేను త్వరగా రమ్మన్నానని చెప్పు పో, ఇక్కడ ఉన్నట్టు!" అని అన్నాడు.

కాళి పరుగెత్తింది.

పిలుపువిని లలిత పైకివచ్చి ముందుకిటికీ సందులోనుంచి చూసింది. శేఖరుడు నేలవంక చూస్తూ క్రింద కూర్చునివున్నాడు. అతని ముఖం ఇలా ఉండటం ఆమె ఎప్పుడూ చూడలేదు. లలితకు ఆశ్చర్యం కలిగింది. భయంకూడా వేసింది. నెమ్మదిగా గదిలోకివచ్చి నిలబడగానే "రా!" అని తొట్రుపాటుతో శేఖరుడు లేచి నిలబడ్డాడు.

"నన్ను పిల్చావా?" అని లలిత మెల్లగా అడిగింది.

"ఆ(!" అని ఒక్కక్షణం శేఖరుడు మాట్లాడకుండా వుండి "రేపు ఉదయం బండికి నేను అమ్మను తీసుకొని పడమట వెళ్ళుతున్నాను. ఈ మాటు తిరిగి వచ్చేవరకు ఆలస్యం కావచ్చు. ఇదిగో తాళంచెవి. నీ ఖర్చుకు కావలసిన పైకం ఆ సొరుగులోనే ఉన్నది."

ప్రతిసారి లలిత వెంట ఉండేది. క్రిందట ప్రయాణానికి ఎంతో ఉత్సాహంతో పెట్టెలో సామాను సర్దింది. ఈమాటు శేఖరదా ఒక్కడే ఆ పని చేస్తున్నాడు—తెరచిన పెట్టెవంక చూడగానే లలితకి ఈ సంగతి జ్ఞాపకం వచ్చింది.

శేఖరుడు ఆమె వైపునుంచి దృష్టి మరల్చి ఒకమాటు దగ్గి గొంతు సవరించుకొని "జాగ్రత్తగా వుండు! ఇంకేదన్నా ముఖ్యావసరముంటే

"చక్రపాణి"

అనువాదం

అన్నయ్యనడిగి చిరునామా తెలుసుకొని ఉత్తరంరాయి" అన్నాడు.

తర్వాత ఇద్దరూ నిశ్శబ్దముగా ఊరకున్నారు. ఈమాటు తాను వెంట రావటంలేదని శేఖరదా తెలుసుకున్నాడు. బహుశా దానికి కారణంకూడా వినివుంటాడని భావించి లలిత క్రుంగిపోయింది.

"సరే నీవిక పోవచ్చు. నేను మళ్ళీ యివన్నీ సర్దుకోవాలి. వేళ చాలా మిగిలింది. ఒకమాటు ఆఫీసులోకికూడా పోయిరావాలి!" అన్నాడు శేఖరుడు నిశ్శబ్దాన్ని భంగపరచి.

లలిత తెరచిన పెట్టెముందు మోకాళ్ళమీద కూర్చుని "మీరు స్నానం చేయండి. నేను సర్దుతాను" అన్నది.

"ఐతే మంచిదే." అని తాళపుచెవులగుత్తి లలితముందు వేసి గది బయటదాకావచ్చి ఆగి "నా కేమేమి అవసరమో మరచిపోవుకదా!" అని అన్నాడు.

లలిత తలవంచుకొని పెట్టెలోని వస్తువులను పరీక్షించనారంభించింది. జవాబివ్వలేదు.

శేఖరుడు క్రిందికివెళ్ళి తల్లిని అడిగి కాళి చెప్పిందంతా సత్యమేనని తెలుసుకున్నాడు. గురుచరణుడు అప్పుతీర్చిన సంగతి నిజమే. లలితకు వరుణ్ణి వెతుకుతున్న మాటకూడా రూఢే. అతను ఇకేమీ అడగకుండా స్నానం చేయటానికి వెళ్లిపోయాడు.

గంటా రెండుగంటల తర్వాత స్నానాహారాలు నిర్వర్తించుకొని ఆఫీసు దుస్తులు వేసుకోటానికి శేఖరుడు గదిలోకివచ్చి నిజంగా స్తంభితుడయిపోయాడు. ఈ రెండు గంటల్లో లలిత ఏమీ చేయలేదు. తెరచిన సూటుకేసు మూతమీద తల పెట్టి ప్రతిమవలె కూర్చున్నది. శేఖరుని కాలిచప్పుడు విని చకితురాలై తలఎత్తి చూచి మరల తల వంచుకున్నది. ఆమె కళ్ళు రెండూ జపాపుష్పాలవలె ఎర్రనైనవి.

కాని శేఖరుడు ఇది గమనించికూడా గమనించలేదు. ఆఫీసు దుస్తులు వేసుకుని చాలా సహజంగా "ఇప్పుడు నీవల్లకాదు లలితా, మధ్యాహ్నం వచ్చి సర్దు." అని ఆఫీసుకు వెళ్ళిపోయాడు. లలిత కళ్లు ఎర్రబడటానికి కారణ మేమిటో అతను గ్రహించాడు. కాని అన్నివైపులా బాగా ఆలోచించి చూడందే అతను ఏమనటానికీ సాహసించలేక పోయాడు.

ఆవాళ మధ్యాహ్నం లలిత టీ తీసుకువచ్చి వాళ్ళ మామదగ్గర శేఖరుడు కూర్చుని వుండటంచూసి స్తంభించిపోయింది. శేఖరుడు ఇవాళ గురుచరణబాబు దగ్గర సెలవు తీసుకోవటానికి వచ్చాడు.

లలిత తలవంచుకొని రెండుకప్పుల టీ తయారుచేసి ఒకటి గిరీన్ ముందూ రెండోది మామ ముందూ పెట్టగానే "శేఖరబాబుకు టీ ఇవ్వలేదేమి లలితా!" అని గిరీనుడు అడిగాడు.

"శేఖరదా టీ త్రాగడు." అని లలిత తల ఎత్తకుండానే మెల్లగా అన్నది.

గిరీన్ ఇక ఏమీ అనలేదు. అతనికి లలిత టీ త్రాగని సంగతి జ్ఞాపకం వచ్చింది. "శేఖరుడు టీ త్రాగడు. ఇతర్లు త్రాగటానికి కూడా ఇష్టపడడు."

టీ కప్పు పైకెత్తి గురుచరణుడు వరుని సంగతి ఎత్తాడు. కుర్రవాడు బి. ఏ. చదువుతున్నాడని మొదలుపెట్టి అతని గుణగణాలన్నీ వర్ణించి చివరకు అన్నాడు.

"కాని మా గిరీనుకు నచ్చలేదు. నిజానికి కుర్రవాడు చూపులకు అంత బాగుండడు: కాని మగవాళ్ళ చక్కదనం యెందుకు ఉపయోగిస్తుంది? గుణాలుంటే చాలు!"

ఏదోవిధంగా వివాహం అయిపోతే గురుచరణునికి స్వస్థత చిక్కుతుంది.

శేఖరునికీ గిరీనుకూ ఇదే ప్రథమ పరిచయం. శేఖరుడు అతని వంక చూచి మందహాసం చేస్తూ "గిరీనుబాబుకు ఎందుకు నచ్చలేదు? కుర్రవాడు చదువుతూ వుండె, స్థితికూడా బాగావుండె; ఇంతకంటె మంచి వాడెక్కడ దొరుకుతాడు?" అని అడిగాడు.

శేఖరుడు అడిగాడేకాని గిరీనుకు ఇప్పుడు ఎందుకు నచ్చనిదీ ఇక ముందు కూడా ఎందుకు నచ్చనిదీ ఎరుగును. కాని గిరీనుడు ఈ ప్రశ్నకు వెంటనే జవాబివ్వలేక పోయాడు. కొంచెం సిగ్గుకూడా పడ్డాడు. శేఖరుడు అది గమనించి లేచి నిలబడి "కక్కాయీ! రేపు అమ్మను తీసుకుని పడమట వెళ్లుతున్నాను. సమయానికి కబురు చేయటం మరిచిపోయేవు!" అని అన్నాడు.

"అదెలాబాబూ! మీరుతప్ప మాకింకెవ్వరున్నారు? అదికాక తల్లి లేకపోతే ఇక్కడ పెళ్ళిపనులెలా జరుగుతాయి? నువ్వేమంటావు లలితా?" అని వెనక్కు తిరిగిచూసి "ఎప్పుడో లేచి పోయిందే!" అని అన్నాడు.

"ఈ మాటలు రాగానే లేచిపోయింది." అన్నాడు శేఖరుడు.

గురుచరణుడు గంభీరభావంతో "పోక యేం చేస్తుంది? ఎలా అయినా కొంచెం జ్ఞానం వొచ్చిన పిల్లగా!" అని చిన్న నిట్టూర్పు విడిచి "మా తల్లి ఒక్క మాటే లక్ష్మి, సరస్వతీ! ఇలాంటి పిల్ల మంచి అదృష్టవంతులకు గాని లభించదు, శేఖరనాధ్!" అన్నాడు.

౭

లలిత టీపార్టీనుంచి చెప్పకుండా పారిపోయివచ్చి శేఖరుని గదిలో ప్రవేశించి గ్యాస్‌లైటు వెలుతురున పెట్టెతెర్చి శేఖరుని ఉన్న గుడ్డలు సర్దనారంభించింది. కొంచెముసేపటికి శేఖరుడుకూడా గదిలోకి వచ్చాడు. అతని ముఖంచూసి భయంతోనూ విస్మయంతోనూ లలిత స్తంభితురాలయింది.

వ్యాజ్యంలో సర్వస్వమూ ఓడిపోయిన మనిషి ఎలాంటి ముఖంతో కోర్టులోనుంచి బయటికి వస్తాడో, ఒక్క గంట క్రింద చూసిన వ్యక్తి కూడా అతన్ని ఎలా గుర్తింపజాలడో, అలానే ఈ ఒక్క గంటలో లలిత శేఖరుని ముఖం గుర్తింపజాలక పోయింది. అతని ముఖంమీద సర్వస్వమూ పోగొట్టుకున్న చిహ్నాలు కాలుతూ ఉన్న ఇనుముతో ఎవరో వాత వేసినట్టు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"ఏం చేస్తున్నావు లలితా?" అని శేఖరుడు పొడిగొంతుకతో అడిగాడు.

లలిత ఆ ప్రశ్నకు జవాబివ్వకుండా శేఖరుని రెండు చేతులూ పట్టుకొని—"ఏమిటి అలాఉన్నావు శేఖరదా?" అన్నది రోదన స్వరంతో.

"ఎలా ఉన్నాను!" అని శేఖరుడు బలవంతాన నవ్వాడు. లలిత కరస్పర్శ మూలాన అతని ముఖాన కొంచెం జీవం వచ్చింది. అతను దగ్గరలోవున్న కుర్చీలో కూలబడి "నువ్వేమిచేస్తున్నావు లలితా?" అని మరల ప్రశ్నించాడు.

'ఓవరు కోటు ఇందులో పెట్టటం మరచిపోయాను. అదే తీసుకు వచ్చాను.'

లలిత ఇప్పటికి కొంత తెప్పరిల్లుకున్నదని శేఖరుడు గ్రహించాడు. లలిత చెప్పనారంభించింది:

"క్రిందటిసారి బండిలో మీరు చాలా ఇబ్బంది పడ్డారు. కోట్లు చాలా ఉన్నాయి కాని కొంచెం మందంగా ఉన్నది ఒక్కటికూడాలేదు. అందుకని నేను తిరిగి రాగానే దర్జీకి కొలతలిచ్చి యిది తయారు చేయించాను" అని మొద్దుగా ఉన్న ఒక ఓవరుకోటు తెచ్చి శేఖరున్ని ముందు పెట్టింది.

శేఖరుడు దాన్ని చేత్తోపరీక్షించి "ఎప్పుడూ? నాకు చెప్పనేలేదు" అన్నాడు.

లలితనవ్వి "మీరు 'బాబు' లైతిరి! మీకు చెప్పితే యింత మొద్దు తయారు చేయనిచ్చేవారా? అందుకనే చెప్పలేదు; కుట్టించి అట్టేపెట్టాను" అని ఆకోటు యధాస్థానంలో పెట్టి, "సరిగ్గా పైనే ఉంది. పెట్టె తెరవగానే కనపడుతుంది. చలివేస్తే తొడుక్కోవటం మర్చిపోయేరు!" అని జ్ఞాపకం చేసింది.

"సరే!" అని శేఖరుడు కొంచెంసేపు రెప్పవాల్చకుండా లలితవంక చూసి "ఉహు, అది అసంభవం!" అని అన్నాడు.

"ఏది అసంభవం? తొడుక్కోవటమా?" అని లలిత అడిగింది.

శేఖరుడు తడబడుతూ, "కాదు, అసంగతికాదు. అది ఇంకోసంగతి. సరే లలితా సామాన్లు సర్దటం అయిందేమో అమ్మను కనుక్కున్నావా?" అన్నాడు.

"ఆ మధ్యాహ్నంపూట అంతా నేనే సర్దాను." అని ఒక్కమాటు మరల అన్ని వస్తువులు పరీక్షించి పెట్టెకు తాళం వేయసాగింది.

శేఖరుడు ఒక్కక్షణం ఆమెవంకచూసి "సరేగాని లలితా! వచ్చే సంవత్సరం నాకివన్నీ ఎవరు సర్దుతారో చెప్పగలవా?" అని మృదుస్వరంతో అడిగాడు.

లలిత శేఖరుని వైపుకు తిరిగి "ఎందుకు?" అన్నది.

ఎందుకో నాకు బాగా తెలుసును! అని మనసులో అనుకొని తాను ఎత్తిన ప్రసంగాన్ని మార్చాలన్నే ఉద్దేశముతో వాడిపోయిన ముఖం మీద బలవంతాన నవ్వు తెచ్చిపెట్టుకొని "కాని వరుల ఇంటికి పోకముందు ఎక్కడెక్కడ ఏమేమి ఉన్నదో నాకు చూపించిపో లలితా. లేకపోతే అవసరం వచ్చినప్పుడు నాకేదీ దొరకదు!" అన్నాడు.

"పోండి!" అన్నది లలిత కోపం తెచ్చుకొని.

శేఖరునికి ఇప్పుడు నవ్వు వచ్చింది.

'పోవటం నాకు తెలుసు. కాని వచ్చేసంవత్సరము నేనేమి చేసేది. నాకు సర్దా అయితే పదహారణాలున్నది. కాని శక్తి దమ్మిడీదికూడా లేదు. ఈ పనులన్నీ నొకర్లు చేస్తే కుదరదు. ఇక నేనుకూడా మీ మామమాదిరి ఒక జత దుస్తులలోనే విడవవలసి వచ్చేటట్టున్నది. సరే, ఏమి చేస్తాము జరగాల్సిందేదో జరుగుతుంది!' అని శేఖరుడు నిరుత్సాహంతో అన్నాడు.

లలిత తాళపుచెవులగుత్తి మేజామీద పారవేసి పారిపోయింది.

'రేపు ఉదయం ఒకమాటురా!' అని శేఖరుడు కేక వేశాడు.

లలిత విని కూడా వినిపించుకోలేదు. తొందరగా మెట్లు దిగి

## రైతు మహాసభ

(11 వ పేజీ తరువాయి)పోలీసువారు యిప్పుడు రైతు సంఘాలమీదకి దండెత్తుతున్నారు. ప్రతి ఆఫీసులోని భోగట్టాలు తెమ్మని ప్రవేశిస్తూ యున్నారు. పోలీసులువెళ్ళి వాళ్ళ సర్క్యూలర్ల ప్రకారం యీ క్రింది విషయాల వివరాల్కై నిర్భంధిస్తూ యున్నారు. (1) రైతు సంఘాల పని ఏమిటి (2) ఏ ఉద్దేశంతో స్థాపన చేయబడ్డాయి (3) వాటి ప్రస్తుత కార్యక్రమమేమిటి (4) అవి ముందు చేయబోయే దేమిటి (5) అధ్యక్ష కార్యదర్శులెవరు (6) ఎంతమంది సభ్యులున్నారు. యిదిచూచి రైతులు భయపడి పోవుచున్నారు.

గవర్నమెంటు ఉద్యోగస్థులుగాని పోలీసులుగాని అక్రమంగా సంచరించిన, లంచాలు పుచ్చుకున్న తగిన విచారణచేసి తమకు తెలియపర్చమని ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సంఘంవారు జారీచేసిన ప్రకటనానుసారంగా కాంగ్రెసు కమిటీలు పంపిన నివేదికలపై రాష్ట్రకాంగ్రెసు సంఘం వారుగాని, గవర్నమెంటు వారుగాని, యింతవరకు ఎట్టిచర్యను తీసుకోకుండుటచేత స్థానిక కాంగ్రెసు కమిటీలు అనవసరముగా జోక్యం కలిగించు కొంటున్నారనే అభిప్రాయముతో ఉద్యోగస్థులు కోపంగా చూస్తున్నారు. కాంగ్రెసు ప్రభుత్వంలో లంచం పుచ్చుకొన్న వారిపై కఠినమైన చర్య తీసుకుంటారని ఋజువు అయ్యేలాగున గవర్నమెంటువారు వెంటనే చర్య తీసుకోవడం చాలా అవసరం. శాసన సభ్యులమైన మేమంతా యిట్టి ప్రభుత్వచర్యలకు సమాధానాలు ప్రజలకుచెప్పలేక సిగ్గుతో తలలు వంచుకోవలసిన పరిస్థితులు సంప్రాప్తము అయినాయి.

### ప్రభుత్వ ల్యాండు రెవిన్యూ విధానము

గవర్నమెంటు జిరాయితీ భూములను పరిపాలించే చట్టము యింతవరకు తయారుకాలేదు. ప్రభుత్వ రెవిన్యూ ఉద్యోగస్థులు తమ అనుభవముల ననుసరించి అప్పుడప్పుడు జారీచేసే అర్డర్ల ద్వారా, మన ల్యాండు రెవిన్యూ పరిపాలనవిధానం సాగడం చాల శోచనీయం. బంజరు రూల్సు, పట్టా నిబంధనలు, గ్రామ కంఠం పోరంబోకులకు సంబంధించిన రూల్సు, మిగతా నీటి తీరువ, సరఫరా నిబంధనలుఎప్పటికప్పుడు ఒక్కొక్క ఉద్యోగస్తుని చిత్త వృత్తి ననుసరించి మారుతూ వుండడం చాల అనర్థదాయకం. అందుచేత మనదేశంలో ల్యాండు రెవిన్యూ పరిపాలన సర్వసమ్మతమైన సూత్రముల ననుసరించి సాగేటందుకు ఒక శాసనము తయారు చేయడం అవసరం. అందు ముఖ్యంగా శిస్తు నిర్ణయభాగం విచారించేటప్పుడు ప్రభుత్వానికి విభజాదాయంలో యెంత వుండాలి; పట్టాదారుకు యెంత మిగలాలి; కవులుదారుండే వానికి ఎంత కట్టుబడి కావాలి. యీ మొదలైన విషయాలు అన్నిరాష్ట్రాలవారికి సంబంధించినవే గనుక కాంగ్రెసు పెద్దలు, ఒకే పద్ధతి అన్ని రాష్ట్రాలు అవలంబించేలాగున నిర్ణయించక పోతే ముమ్ముందు చాలా విమర్శనకు కాంగ్రెసు వారు పాత్రులౌతారు.

### జమీందారీ రిపోర్టు.

1802 పెర్మెనెంటు సెటిల్మెంటు షరతులలో అంతకు పూర్వం పట్టారెగ్యులేషన్‌లో, రైతుదే భూస్వామ్యమని జమీందారుకి శిస్తు హెచ్చించే అధికారం లేదని, మొదలైన సూత్రాలు నిర్వంధపబడి యున్నప్పటికీ అనాడు ప్రభుత్వంలో పలుకుబడి ప్రాతినిధ్యంలేని పేదరైతులు తమ హక్కులు రక్షించుకోలేనంత మాత్రాన వారి హక్కులు గోల్పోయినారని అనుటకు ఎంత మాత్రం వీలులేదు. జమీందార్లమాట ఆనాడు ప్రభుత్వమందు సాగింది గనుకనే వారికి అనుకూలంగా శాసనాలు న్యాయస్థానతీర్పులు అంతకు ముందులేని హక్కులు సాధించుకోగలిగారు. యీనాడు కాంగ్రెసు ప్రభుత్వం యేర్పడింది. గనుక అనాడు రైతులకు జరిగిన అన్యాయం సవరించి వారి హక్కులు నేడు రక్షించవలసిన బాధ్యత మన యీ కాంగ్రెసు ప్రభుత్వంపై యున్నది. భూస్వామ్యము రైతుదేనని నిర్ణయించుతూ కమిటీ రిపోర్టులో చూపించిన ఆధారాలు నిరాఘాటమైనవి. అవి కాదనడానికి ఎవరికి సాధ్యం కాదు. అందుచేత పెర్మెనెంటు సెటిల్‌మెంటు ముందున్న శిస్తులు హెచ్చించుటకు జమీందార్లకెట్టి అధికారంలేదు.

కేవలం ప్రభుత్వం తరపున రైతులవద్ద శిస్తులు వసూలుచేయుటకు యేర్పడిన రెంటు కలెక్టర్లకంటె జమీందార్లకు ఎక్కువ హోదా లేదని స్పష్టముగా నిర్వచించినారు.

ప్రకాశం కమిటీ రిపోర్టుతో యిన్లూడెడ్ యినాములని, సెటిలుమెంటు దరిమిలా యినాములని వేరు వేరుగా విభజించడంవలన యినాం రైతులకు చాలా ఆందోళనగానున్నది. రైతుల సాధక బాధకాలు సర్వత్రా ఒకే మాదిరిగా వుండేటప్పుడు యినాం రైతులకు ప్రత్యేక పద్ధతి చేయాలనుట న్యాయం కాదు.

యధార్థము పరికిస్తే జమీన్ రైతుల స్థితిగతులకంటె యినాందారి రైతులు స్థితిగతులు మరీ అధ్వానము. వెట్టిచాకిరీలు చేయించుకొనుటరోను, లేనిపోని మామూళ్ళను అక్రమ వసూళ్లుచేసి, రైతులను పీడించుటలోను జమీందార్లకు యినాందార్లు ఏమాత్రంతీసిపోరు. ఇనాం రైతులకు 1936 ఎస్టేటు ల్యాండు అక్టులో ఒసంగబడిన హామీలకు ఏమాత్రం భంగము కలగకుండా ముందు శాసనం తయారుచేయవలసి వుంటుందనియు యినాం శాసనంకూడా వెంటనే ఎస్టేట్లచట్టంతోబాటు ప్రవేశపెట్టవలెనని మనం తీర్మానించాలి.

కాంగ్రెసువారు మంత్రులుగా వున్నారుకదా రెండుసభలలో వారికి కావలసినంత మెజార్టీ గదా మనకేమి, రిపోర్టు అనుకూలంగావుంది. గనుక మిగతా కాండ అంతా సానుకూలంగా సాగిపోతుందని ధీమాగా రైతులంతా పడుకొనక యీ రిపోర్టును అనుకూలంగా ప్రజాభిప్రాయక కలిగేటట్టు నిరంతరం ఆందోళన సాగించాలి. యీ సిఫార్సులప్రకారం బిల్లు తయారై శాసనము చేయడానికి అవుసరమైనబలము రివిన్యూమంత్రిగారికి వారి అనుచరులకు యితర శాసన సభ్యులకు దేశంలో చేకూర్చాలి. కాంగ్రెసు సంఘాలు ఏకమై పనిచేయాలి.

### అవసరమైన శాసనసభ్యులు రాజీనామా యివ్వాలి.

ఒరిస్సాలో యిదివరకే మదరాసు ఎస్టేట్లకు సంబంధించిన శాసనం సవరించి ఆ శాసనసభవారు ప్యాసుచేసి నేటికి 14 మాసాలు కావచ్చింది. జమీందారీల ఆందోళనకు లొంగిపోయి గవర్నరు, గవర్నరుజనరలు ఇంతవరకు ఆ శాసనం అనుమతించనందున అమలు జరుగలేదు. ప్రజా ప్రతినిధులచే శాసనబద్ధమైన చట్టాన్ని అనుమతింపక పోవడానికి గవర్నరుకు గవర్నరుజనరలుకు ఎంతగుండెధైర్యమో అలోచించండి. యీ సందర్భంలో కాంగ్రెసు వర్కింగు కమిటీ పెద్దలు ఏమిచేయాలో ఇంతవరకు సూచించలేదు.

మన రాజధానిలో కూడా యిట్టి క్లిష్టపరిస్థితి యేర్పడవచ్చు. అప్పుడు అవుసరమైన శాసన సభ్యులు రాజీనామాలివ్వాలి. ఐక్య కంఠంతో ప్రజలుకోరే యీ శాసనాలు అమలు జరుగకపోతే ప్రభుత్వం యింక సాగనివ్వరని తెలిసేటట్టు ప్రజాశక్తిని విజృంభింపజేసి ప్రజాబలం ప్రదర్శించాలి. యీ రిపోర్టునందుగల సిఫార్సులు, బాలారిష్ట గండము లన్నీ దాటి మధ్య సన్నగిల్లి కృశించిపోకుండా శాసనమై గవర్నరు గవర్నరు జనరలు అనుమతి పొంది అమలులోకి వచ్చేవరకు రాష్ట్రప్రజలు నిద్రపోకుండా నిరంతర ఆందోళన సాగించి, తమ హక్కులకై పోరాడాలి.

* * *

## తీర్మానాలు

కృష్ణాజిల్లా రైతు మహాసభలో ఈ దిగువ తీర్మానములు ఆమోదింపబడెను.

### వ్యవసాయ కూలీలు రైతు సంఘములు.

వ్యవసాయ కూలీలు తమ కష్టములను బాధలను తొలగించుటకుగాను, తమ వర్గ సంఘములను ప్రత్యేకముగా యేర్పాటు చేసుకొనుటకు యీ సభవారు అంగీకరించు చున్నారు. కాని రైతు సంఘములలో నిరంతరం పోట్లాడు సంఘములుగా తయారై రైతుల వ్యవసాయ కూలీలమధ్య సంఘర్షణలు సంభవించేలాగు వ్యవసాయ కూలీ సంఘములు ప్రవర్తించ రాదు. ఇది రైతు కూలీ సామరస్యమునకు, ఐకమత్యమునకు చాల హానికరమై తీరని నష్టము వుభయులకు వాటిల్లగలదు. వుభయుల ఆశయము తీరేరజాలవు. అందుచే వుభయ సంఘములు తమ తమ ప్రత్యేక అవుసరయిబ్బందులను తమ తమ సంఘముల ద్వారా తొలగించుకొనుచు, వుభయులకు ఆశయమైన స్వాతంత్ర సంపాదనకు కలసి మెలసి కృషిచేయుటయే ప్రధాన లక్ష్యముగా గుర్తించవలెను. ఈ దృష్టితో పరస్పర మిత్రభావము సామరస్యము యుండుటకును రైతులయందు కూలీలకుకూడ విశ్వాసము కలిగియుండుటకును, వ్యవసాయ కూలీల కనీస కోర్కెలు రైతు లెంతవరకు తీర్చగలరో అంతవరకు వుదార, దయ స్వభావములతో తీర్చుచుండవలెను. రైతు సంఘముచే అంగీకరించబడిన వ్యవసాయ కూలీల కనీస కోర్కెలను రైతులు తీర్చేటట్లు రైతులలో తీవ్రకృషి చేయవలెనని రైతు సంఘములను యీ సభవారు హెచ్చరించుచున్నారు.

### అఖిలభారత కిసాన్ మహాసభ.

రాబోవు అ. భా. కిసాన్ మహాసభను ఆంధ్రదేశములో జరుపనున్నందులకు యీ సభవారు తమ సంతోషాన్ని తెల్పియజేస్తూ అనుహాసభను కృష్ణాజిల్లాలో జరుపుటకు అనుమతి నీయవలసినదిగా యీ సభవారు ఆంధ్రరాష్ట్ర రైతు సంఘ కార్యనిర్వాహక వర్గం వారిని కోరుచున్నారు.

కొల్లేటి వరదలవలన కైకలూరు తాలూకా నష్టపడుచున్నది గాన, గరశపూడి, యుండపల్లి దగ్గర అండర్‌టన్నల్సుకట్టి కొల్లేటి మురుగును ప్రత్యేక మురుగు కాల్వ ద్వారా పంపించవలెనని దానికి తగు ఏర్పాట్లు చేయాలని ప్రభుత్వమును కోరుచున్నారు.

లంచగొండితన విచారణ కేసులయందు జి ఓ. లను అనుసరించి విచారణ జరుగుట లేదు. గాన, వాటిని తప్పకుండా అమలుపర్చవలసినదిగా ఉద్యోగస్తులను కోరుచు చెడ్డపేరు బలమైన అనుమానము గలిగిన ఉద్యోగిపై నేరము సాక్ష్యము ద్వారా క్రిమినల్ కేసులో వలె ఋజువు కాకపోయినప్పటికిని ఉద్యోగములో వుండబడుటకు హక్కు లేదు, అని చెప్పిన విషయము సార్థక జరచవలసినదిగా ప్రభుత్వమును ఈ సభవారు కోరుచున్నారు.

కృష్ణా ఆనకట్టకు పై భాగమున ఒడ్డుదిబ్బ వుండుటచే నీరు యెక్కువ నిల్వయుండుటలేదు గాన వెంటనే క్రింది తూములు (under sluices) ని శుభ్రపరచి, ఒడ్డు దిబ్బను తీసివేయవలసినదిగా ప్రభుత్వమును కోరుచున్నారు.

సాముదాయక భూముల దావాలని ప్రభుత్వం వారికి జమిందారులకు జరుగుచున్న దావాలని ప్రభుత్వోద్యోగులు జమిందారునకు అనుకూలముగా సాక్ష్యమిచ్చుచుండగా గవర్నమెంటు మిన్నకుండుటవలన రైతులకు చాల నష్టము కలుగుచున్నది. రైతులవాదమును కోర్టులో వాదించుటకు రైతుసంఘమును బాధ్యతవహించవలసినదిగా ఈసభవారు కోరుచున్నారు.

రాజధానియంతటను ఒకే తూకములును, కొలతలును ఉండునట్లుగా శాసనము చేయవలసినదిగా ప్రభుత్వమును కోరుచున్నారు.

రైతుల యిరిగేషన్ యిబ్బందులను ఉద్యోగస్థులకు ఎప్పటికప్పుడు తెలియజేయుటకది పి. డబ్లియు. డి. శిఖవారి పెలిఫోనులను రైతులు ఉపయోగించుకొనుటకు అవకాశము యివ్వవలసినదిగాను,

దివిసీమలో కాళీగా ఉన్న భూములను బీద రయితులకు యెట్టి నజరానాను తీసుకోకుండా యివ్వవలసినదిగాను తీర్మానించిరి.

### వాలంటీరు దళము.

రైతు వుద్యమమును కేంద్రీభూతముగ నడుచగలుగుటకుగాను రైతుసంఘములు సుశిక్షతముగను నిర్మాణయుక్తముగ నుండవలయును. వీలైనచోట్లెల్లెడ గ్రామమున జూను నెలాఖరులోపల రైతు వాలంటీరు దళములను యేర్పరచి ఆవాలంటీరు దళములకు శిక్షణ యొసగుటకుగాను వాలంటీరు శిబిరములను ప్రతి తాలూకాలోను యేర్పరచవలసినదిగాను అందులకు యిప్పటినుండే గ్రామ తాలూకా రైతు సంఘములు పూనుకొని పని చేయవలసినదిగా యీ సభవారు రైతుసంఘములను కోరుచున్నారు.

* * *

### నూతన కృష్ణాజిల్లా రైతు సంఘ కార్యనిర్వాహకవర్గ ఎన్నిక.

శ్రీ కామినేని వెంకటప్పయ్యగారు, అధ్యక్షులు.
,, పామిరెడ్డి వెంకట సుబ్బారావురెడ్డిగారు, ప్రధాన కార్యదర్శి.
,, వెల్లంకి విశ్వేశ్వరరావు,
,, అనుమర్లపూడి శీతారామారావుగారుగార్లు, సహాయ కార్యదర్శులు.

శ్రీ సుంకర సూర్యనారాయణ, బి. ఏ., కాకాని వెంకటరత్నం, పేట బాపయ్య, యేజెళ్ల వెంకట సుబ్బయ్య, నల్లపాటి వెంకట్రామ నర్సయ్య, పొన్నం వీరరాఘవయ్య, బి. ఏ., గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, కామినేని వెంకటరత్నం, యెర్రంశెట్టి కృష్ణమూర్తి, భాగర్లమూడి బ్రహ్మానందరావు, చలసాని వాసుదేవ గార్లు కార్యనిర్వాహకవర్గ సభ్యులు.



# మునగాల జమీందారు రాజీ షరతుల త్రోసిపుచ్చాడు

## రైతులు తమ హక్కుల కోసం పోరాడుతారు

శ్రీ అక్కిరాజు మాధవరావు

ఇప్పుడు వచ్చిన తగాదా మెట్ట శిస్తు రిమీషను విషయంలోను, ఇనాములకిచ్చు పట్టా షరతులు విషయములోను, ఈ సంవత్సరం వేరుశనగ పండినను సకాలములో వర్షములు కురియకపోవుటచే నేల బిగుసుకుపోయి కాయ సగం భూమిలోనే నిలచిపోయినది. మా పైర్లలో జొన్న పూర్తిగా నష్టమైనది. పైరు మూరెడెత్తయినను ఎదుగక పశువుల గ్రాసమునకు కూడా పనిరాకుండా పోయినది. కాబట్టి జనవరి నెలలో జిల్లా కలెక్టరు మునగాలకు వచ్చినప్పుడు పైరు నష్టమైనది కాబట్టి రిమీషను ఇప్పించవలసినదిగా అనేక గ్రామముల రైతులు మహజరును సమర్పించుకొనిరి. కలెక్టరుగారున్ను స్వయముగా కొన్ని చేలను పరీక్షించి పైరు నష్టములను గుర్తించి, రిమీషనును యిచ్చుట న్యాయమని సిఫార్సు చేస్తూ జమీందారునకు ఆ మహజరు పంపించిరి. తదుపరి ఫిబ్రవరి ఆఖరు వారములో రాజీ సందర్భములలో శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు మునగాలకు వచ్చినప్పుడు మేము మెట్ట శిస్తులో రు. 1కి 0-4-0 రిమీషను కోరగా జమీందారు 0-2-0 రిమీషను ఇచ్చుటకు అంగీకరించిరి. శ్రీ ఎర్నేని సుబ్రమణ్యంగారు మాత్రం 0-3-0 రిమీషను ఇప్పించెదమని తెలిపిరి. కాని తమ పాత బకాయీలన్నియు చెల్లించిననే ఈ రిమీషను ఇవ్వబడునని యస్టేటువారు ఆనాడు తెల్పినారు.

1346, 47 ఫసలీల శిస్తు బకాయీతో చెల్లించినచో 1345 ఫసలీ అంతకు పూర్వము బకాయిలున్న రద్దు చేయించవలెనని కోరగా కూడా అంగీకరింపబడెను.

కాని ఈ 0-3-0 రిమీషను కేవలం మాగాణికి స్తికే గాని మెట్ట రెండు కిస్తీలకు గాదని ఎస్టేటువారు తెల్పుటచే, తగాదా వచ్చినది. తాము ప్రథమంలో 0-2-0 రిమీషను ఇచ్చెదమన్నది ఒక్క మాగాణి కిస్తీకేననియు, శ్రీ సుబ్రమణ్యంగారు కోరినందువల్ల 0-3-0 రిమీషను నిచ్చుటకంగీకరించితిమని యెస్టేటువారి వాదన. రిమీషను నిచ్చువాడుక ఎల్లప్పుడును మొత్తం శిస్తుకుగాని సగం కిస్తీకి కాదనియు, మేము కోరినది పూర్తి మెట్ట శిస్తుకనియు, సుబ్రమణ్యంగారు 0-3-0 రిమీషను ఇప్పిస్తానన్నది పూర్తి శిస్తుకనియే భావించవలసి యున్నదనియు రైతుల వాదన. సుబ్రమణ్యంగారిని కనుక్కొనగా 0-3-0 రిమీషను ఇప్పిస్తామన్నది నిజమేగాని ఎన్ని కిస్తీలో తమకు తెలియదని, రిమీషను కలెక్టరుగారిని కనుక్కొనగా ప్రథమములో వారు 0-2-0 ఇస్తానన్న రిమీషను పూర్తి మెట్ట కిస్తికే, అనగా రెండు కిస్తీలకే నని తెలిపిరి. అందుపైని యస్టేటువారు పూర్తిమెట్టపై రెండు అణాల రిమీషను అనగా వక్క మాగికి స్తికి రూపాయలో 0-4-0 రిమీషన్ ఇచ్చెదమనియు, కాని తమ కమతం శిస్తులు కూడా చెల్లింపబడిననే ఈ రిమీషను ఇవ్వబడునని కొత్త షరతులను తెలుపసాగిరి. అందుపై శ్రీ బ్రహ్మయ్యగారిని కలుసుకొని ఈ విషయములను తెలుపగా వారు 30-3-39 న విచారించి కమతం శిస్తులతక్కున్న రిమీషనుకున్ను నంబంధంలేదని తేల్చి 1346-47 ఫసలీ బకాయీలను 1348 ఫసలీ శిస్తులను రిమీషనులు మినహా 20-4-39 తేదీలోగా చెల్లించినవారికే 1345 అంతకు పూర్వమువున్న శిస్తు బకాయీలను రద్దుచేయవలసినదనియు, 48 ఫసలీ మెట్ట శిస్తులో రు 1కి 0-2-0 చొ॥న అనగా మాగాణీకిస్తీలో రూపాయ 1కి 0-4-0 చొ॥న రిమీషను ఇవ్వవలెననియు నిర్ణయమొసంగి ఆప్రకారముగా శిస్తులు వసూలు చేయించవలసినదనియు శ్రీ మునగాల కుమారరాజాగారికి వుత్తరము వ్రాశిరి. కాని ఇందులకు ఎస్టేటువారు అంగీకరించలేదు. మేము మాత్రము ది 20-4-39 తేదీలోగా 0-4-0 మినహా శిస్తులన్నియు చెల్లించుటకు అయిదు రోజులలో ఏర్పాట్లను గావించితిమి. అయినను ఎస్టేటు వుద్యోగులు శిస్తులను తీసుకొనుటకే నిరాకరించిరి. అందుపై శ్రీ బ్రహ్మయ్యగారు ది 13-4-39 న నడిగూడెమునకు వచ్చి ఇరుపక్షములతోను సంప్రతించినారు. కమతం శిస్తులు తమ మేనత్త, మేనల్లుడు, కుమారులపేర నున్న భూముల శిస్తులు నగదుబాకీలు గల్లాబాకీలు, తుమ్మకంప ఫీజు, రాతిఫీజు వగైరాలన్నియు ది 30-4-39 తేదీలోగా జిరాయితీ శిస్తులతో సహా చెల్లింపబడిననే మాగాణీ కిస్తికి 0-4-0 చొ॥న రిమీషను ఇచ్చెదమని జమీందారుగారి కొత్తషరతు. జొన్నపయిరు నష్టమైనది కాన రిమీషను కోరితిమనియు, కమతం శిస్తుల విషయము కొత్తగా తెచ్చుచున్నారనియు రైతులను నిర్బంధపరచి కమతం వగైరా భూములను హెచ్చుశిస్తులకు అంటకట్టినారనియు, బంధువుల పేరనున్న భూములన్నియు బినామి అనియు, వాటికి రైతులకే పట్టాలు ఇవ్వవలసియుండు ననియు, కాబట్టి కమతం భూములు బంధువుల పేరిట భూముల శిస్తుల నడిగినచో వాటినికూడా విచారణ చేయవలసి యుండుననియు అట్లు విచారణ చేయజాలనిచో కమతం వగైరా భూముల శిస్తులను వదిలి, కేవలం పయిరు నష్టమైనందున మాగికిస్తికి రిమీషను ఇవ్వవలెననియు మాగిలో 0-4-0 రిమీషను ఇవ్వవలెనని నిర్ణయించి నప్పుడే, కొత్తగా కమతం వగైరా భూముల విషయములను ఎస్టేటువారు తెచ్చుచున్నారనియు, రాజీనుండి ఏదో విధముగా తప్పుకొనుటకే వారీ చిక్కును కల్పించుచున్నారనియు, కమతం వగైరా శిస్తుల ప్రస్తావన లేకుండా 0-4-0 చొ॥ల రిమీషను మినహాయించి జిరాయితీ శిస్తులన్నియు నెలాఖరులోగా చెల్లించెదమనియు, మేము తెలిపినాము. కాని యస్టేటువారు అంగీకరించలేదు. ఈ విషయములో తామేమియు నిర్ణయము యివ్వజాలకున్నామనియు, రిమీషను కావలెనన్నచో యస్టేటువారు కోరునట్లు కమతం వగైరా శిస్తుల నివ్వవలెననియు, కమతం శిస్తులు ఇవ్వనిచో రిమీషన్ యివ్వబడదనియు, ఏదో వకపద్ధతిని నిశ్చయించుకొని శిస్తులన్నిటిని చెల్లించినచో ఇతర వ్యవహారములను గూర్చి తాము పరిష్కరింతుమనియు శ్రీ బ్రహ్మయ్యగార్లు తెలిపినారు. ప్రస్తుత పరిస్థితి ఇది. కమతం వగయిరా శిస్తుల నెల్ల చెల్లించినగాని రిమీషన్ యివ్వజాలమని ఎస్టేటువారున్ను, కమతం శిస్తుల ప్రస్తావనలేకుండా రిమీషను ఇచ్చినచో శిస్తులను చెల్లించెదమని రైతులున్ను వాదించుచున్నారు. శిస్తులు చెల్లింపబడినగాని యితర వ్యవహారములను పరిష్కరింపజాలమని శ్రీ బ్రహ్మయ్యగారు తెలుపుచున్నారు. కాబట్టి రాజీ వ్యవహారాలలో ప్రతిష్టంభన కలిగినది. ఈ ప్రతిష్టంభనను యస్టేటువారు బుద్ధిపూర్వకంగా కల్పించినారని నేను భావిస్తూ ఉన్నాను. కాబట్టి ప్రస్తుత మేర్పడిన ఈ పరిస్థితులను విచారించి ముందు కార్యక్రమమును నిశ్చయించుకొనుటకుగాను ది. 23-4-39 న మునగాలలో జమీ రైతు సంఘం సమావేశమగును. ఈ విషయముపైననే రాజీ భగ్నమై తిరిగి పోరాట కార్యక్రమము నవలంభించవలసియున్నచో దేశీయులందరును ఇదివరకువలెనే యస్టేటు ప్రజలకు సానుభూతి సహాయములను అందించ ప్రార్థన. ప్రభుత్వము ఇదవరకువలె సమాధాన బుద్ధితో ప్రవర్తిస్తుందని జమీందారి దుర్నయములనరికట్టితుందని ఆశిస్తున్నాం.

* * *

### తాడేపల్లిగూడెం తాలూకా రైతు సంఘం

ఈతాలూకా రైతు సంఘ సభ్యుల ఎన్నికమే 31వ తేదీని జరుగుననియు, నామినేషనులు ఏప్రెల్ నెలాఖరు లోగా తాలూకా రైతుసంఘాధ్యక్షులు శ్రీ దమ్మలపాటి వెంకటారావుగారికి 0-8-0 రుసుముతో దాఖలు చేయవలెననియు, 25 మంది సభ్యులుగల 1 ఏరియాకు 1 సభ్యత్వ స్థానము కలదనియు వివరములకు తాడేపల్లి గూడెం తాలూకా రైతు సంఘం ఆఫీసు నేషనల్ వాచ్ ఎంపోరియంకి, ఏప్రెల్ 10 తేదీనుండి వచ్చిన తెలుసుకో వచ్చునని కార్యదర్శి కామ్రేడ్ నండూరి సత్యనారాయణగారు తెలియజేయుచున్నారు.

* * *

యలమర్రు గ్రామ రైతు సంఘ సాధారణ సభ్యులు 12-4-39 తేదీన సమావేశమై శిరిపురపు వెంకటరత్నంగారిని గ్రామ రైతు సంఘాధ్యక్షులుగను, కొల్లిపర పరశురామయ్యగారిని కార్యదర్శిగను ఎన్నుకొనిరి.

ఈ క్రింది వారిని కార్యనిర్వాహక సంఘ సభ్యులుగా యెన్నుకొనిరి.

1. వడ్డె శీతయ్య.
2. ఎనిగళ్ళ ఆదినారాయణ
3. శిరిపురపు సత్యనారాయణ (వెంకటప్పయ్య)
4. కోనేరు వెంకటరత్నం
5. సుంకర చంద్రశేఖరేశ్వరరావు

కొత్తూరు వెంకట సుబ్బారావుగారిని తాలూకా రైతు సంఘ సభ్యునిగా యెన్నుకొనిరి.

# కాకినాడ పీచు పనివారల ప్రకటన

## వర్తకుల షరతుల నెందుకు నిరాకరించవలసి వచ్చింది?

ప్రభుత్వము మధ్యవర్తి నియామకము చేసింది : సమ్మె ముగించబడింది.

కాకినాడ పీచుపనివారల సంఘం 14-4-39వ తేదీని పీచువర్తకు లంగీకరించిన రాజీ షరతులను ఎందుకు నిరాకరించవలసి వచ్చిందో తెలియజేస్తూ యీ క్రింది ప్రకటన గావించారు.

7-3-39 వ తేదీ మొదలు, అనగా యిప్పటికి 41 రోజులనుంచి, కాకినాడలో దాదాపు 1000 మంది పీచు కూలీలు సమ్మె చేస్తున్నారు. వీరు తాటినారను దువ్వి, మోపుచేసి, ఉరిమి, ఎండబెట్టి, సైజులు కట్టాలి. కొన్నిరకముల నారకు రంగుపేయుట, ఉడకబెట్టుట, కటింగుచేయుట వగైరాకూడా చేయాలి. మొత్తం 17 రకముల నారతో పని చేయడానికి హండ్రడ్ వెయిట్ (112 పౌనులు) ఒకటికి వేరు వేరు కూలి రేట్లు యివ్వబడతాయి. ఒక హండ్రడ్ వెయిట్ నార మీద పని పూర్తికావడానికి 3 రోజులు మొదలు 5 రోజులవరకు పట్టును. ప్రస్తుతము రేట్లు హండ్రడు వెయిటకు 0-8-0 మొదలు 3-0-0 వరకూ, రకమును బట్టి వర్తకులు యిచ్చేవారు. ఈ రేట్లు ప్రకారం ఒక్కొక్క కూలీకి సగటున రోజు 1 కి 0-1-6, 0-2-0 చొప్పున మాత్రమే వస్తుంది.

పీచు కూలీల సంఘం మొట్టమొదట సమావేశమయినప్పుడు, పూర్వం యిచ్చేరేట్లే యిప్పుడుకూడా యివ్వాలి అని తీర్మానం ప్యాసుచేయబడింది. 10-4-39వ తేదీని మద్రాసు లేబరు కమీషనర్ కాకినాడవచ్చి, సమ్మెదార్ల ప్రతినిధులతోను, వర్తకుల ప్రతినిధులతోను సంప్రతించినప్పుడు వర్తకుల ప్రతినిధులు ఏమాత్రమూ కూలి హెచ్చించుటకు వీలులేదని పట్టుదల వహించారు. కాని, సమ్మెదార్ల ప్రతినిధులు తమ మొట్టమొదటి రేట్లనుండి చాలావరకు తగ్గడానికి అంగీకరించారు. కూలి హెచ్చుచేస్తేగాని వీలులేదని కమీషనర్ వర్తకులకు తెలియజేశారు.

హెచ్చింపు కూలికి వర్తకులు అంగీకరించనందున 12-4-39 వ తేదీన పీచు వర్తకులందరి మీద సబ్ డివిజనల్ మేజస్ట్రేటు 144వ సెక్షన్ ప్రయోగించారు. కాని, 14-4-39 వ తేదీని, ఆ ఉత్తరువు తిరిగి ఉపసంహరించుకొనబడింది. దానికి కారణం, వర్తకులు కూలి రేట్లను కొద్దిగా హెచ్చించడానికి అంగీకరించారని కలెక్టరుగారు తెలియజేశారు. ఈ కొద్దిపాటు హెచ్చింపునకైనా సమ్మెదార్లు అంగీకరించడం ఉత్తమమనీ, వారు ఆవిధంగా అంగీకరించక మొండిగా ప్రవర్తిస్తున్నారనీ, ప్రజలలో ఒక అభిప్రాయము ఏర్పడింది. కాబట్టి, వర్తకుల షరతులలోగల యదార్థమును గురించి ప్రజలకు మేము తెలియ జెప్పవలసియున్నది. ఈక్రింది కారణాలవల్ల కూలీసంఘం ఆషరతులను అంగీకరించలేదు.

1. వర్తకులు మొత్తం 17 రకముల నారకు రేట్లు హెచ్చించడానికి అంగీకరించలేదు. 5 రకములకు మాత్రమే హెచ్చించి, మిగిలిన 12 రకములకు మామూలురేట్లు యిస్తామన్నారు. ఈవిధంగా కూలీలలో చీలికలు కలిగించడానికి అవకాశం ఏర్పడింది.

2. ఆ 5 రకముల నారకు రేట్లు ఏవిధముగా హెచ్చించారో చూదాం. ఆర్డినరీ పొడినారను మోపుచేసి, ఉరిమి, ఎండబెట్టి, సైజు కట్టినందుకు వర్తకులు సమ్మెకు పూర్వం హండ్రడువెయిట్ 1కి 0-8-0 చొ॥ యిచ్చేవారు. ఇప్పుడు 0-9-0 లకు హెచ్చించుట కంగీకరించారు. ఇక రెండవ రకం ఆర్డినరీ పనతడిపి మోపుచేసి, ఉరిమి, ఎండబెట్టి సైజు కట్టినందుకు హండ్రడ్ వెయిట్ 1కి 0-9-0 నుంచి 0-10-0 లకు హెచ్చించారు. యూనియన్‌వారు మొట్టమొదట అడిగిన రేటు, అనగా 2 సంవత్సరాలకు పూర్వం ఉన్న రేటు 0-14-0. ఈ రకపు నార హండ్రడ్ వెయిట్ పూర్తికావడానికి 3 రోజులు పూర్తిగా పట్టుతుంది. ఇద్దరు మనుష్యులు కలసి పని చేయాలి. ఇప్పుడు వర్తకులు అంగీకరించిన 0-1-0 హెచ్చింపు. ఈ యిద్దరు మనుష్యులలో పంచాలి. అంటే మనిషి 1కి 0-0-6 హెచ్చింపు మాత్రమే ఈ అర్ధణాను మళ్ళీ 3 చేత భాగిస్తే, రోజు 1కి ఎంత హెచ్చింపు చేసినదీ తెలుస్తుంది. రోజు 1కి ఒక దమ్మిడీకంటె కూడా తక్కువ హెచ్చింపు గిట్టుతుంది. ఇదే విధంగా, మిగిలిన 3 రకముల నారకు రేట్లు హెచ్చించి నప్పటికీ, రెండు రకముల నారకు హండ్రడ్‌వెయిట్ 1కి 0-2-0 చొప్పున కూడా హెచ్చించినప్పటికి. ఒక్కొక్క హండ్రడ్‌వెయిట్ మీద పనిచేయడానికి 3, 4, 5 రోజులు పనిచేయవలసి వస్తుంది, కనుక యిద్దరు మనుష్యుల చొప్పున పనిచేయవలసి యున్నందునను రోజుకి సగటున యిచ్చే రేటు 0-2-0 కంటె ఏ సందర్భములోను ఎక్కువ ఉండదు. ఒక్కొక్క కూలీకి కాకినాడ పట్నంలో ఈ 0-2-0 డబ్బులతో ఏ విధంగా సంసారం గడవగలదో మీరే ఊహించుకోండి. లేబరు కమీషనరుగారు పనివానికి అధమము రోజు 1కి 0-6-0 యున్న తప్ప జీవనోపాధి గడవదని అభిప్రాయము వర్తకులకు తెలిపారు.

3. కొంతమంది వర్తకులు యిదివరకే హెచ్చింపు రేటు యిస్తామని తెలియచేసారు. కాని వర్తక సంఘంలోని కొంతమంది ఒత్తిడి మూలముగా ముందుకు రాలేక పోయారు. ఒక వర్తకుడైన పేది రామారావుగారు మాత్రము కూలీల న్యాయమును ఆలోచించి షరతులను అంగీకరించాడు. ఇట్టి అంగీకారము మూలముగా వర్తకానికి నష్టము గాదనికూడా తెలియచేశారు. కళ్ళ నీళ్లు తుడవడానికి రోజుకు కొన్ని దమ్మిడీలు మాత్రమే హెచ్చుచేసే రేట్లు కలక్టరుగార్కి వర్తకులు అందచేసిన, వారిమీద 144 సెక్షను తీసివేయుట కూలీల మీద దెబ్బవేయుటే.

4. హెచ్చింపు రేట్లు యివ్వడానికి అంగీకరించిన 5 రకముల నార మిగిలిన 12 రకముల వారకంటె తక్కువ వాడుకలో ఉన్నది అంటే, 1000 మంది కూలీలలో అధికభాగం ఈ 12 రకముల నారనే పని చేయాలి. ఈ 12 రకముల నారమీద పనిచేసే కూలీలకు పై దమ్మిడీ హెచ్చింపుకూడాలేదు. కాబట్టి 14-4-39 వ తేదీని పీచువర్తకులు కలెక్టరుగారి యెదుట వాగ్దానం చేసిన హెచ్చింపు రేట్లను కూలీలు అంగీకరిస్తే, ఏవిధంగా వారిలోవారికి కలహములు ఏర్పడి, ఐకమత్యము చెడుతుందో, ఏవిధంగా వారిలో అనేకమంది పూర్వంకంటె కూడా అధోగతికి వస్తారో యిప్పుడు స్పష్టపడిందని ఆశిస్తున్నాం. వర్తకులమీద 144 సెక్షను తీసివేయుటకు తగినకారణము కనబడుట లేదు. వర్తకులమీద తీసివేసినపుడు కూలీలమీద 144 సెక్షను యుంచుట కూలీల న్యాయమైన హక్కుల కొరకు సమ్మె చేస్తుంటే వారి పౌరసత్వ హక్కుల్ని భగ్నము చేస్తున్నారు.

★ ★ ★

15 వ తేది 120 మందిని అరెస్టు చేశారు. కాకినాడ పీచుకూలీల సమ్మె సందర్భంలో యిప్పటివరకూ మొత్తం సుమారు 250 మంది స్త్రీలను, పురుషులను, పిల్లలను, వృద్ధులను పోలీసులు అరెస్టు చేశారు. 30 మంది మీదమాత్రం రకరకములైన కేసులుపెట్టారు.

కూలీలను అరెస్టుచేసి తీసుకువెళ్ళేటప్పుడు, స్టేషన్ నుండి సబ్ జైలుకు, సబ్ జైలునుండి కోర్టుకు తీసుకువెళ్ళేటప్పుడు, ఎండలో కాళ్ళు కాలుతూండగా నడిపించి తీసుకు వెళ్లారు. కామ్రేడ్ చిన్నకు సంకెళ్ళు వేసి నడిపించారు.

నెం. 1 టవున్ పోలీసుస్టేషన్‌లో హెడ్ కాన్‌స్టబిలు, సబ్ యినస్పెక్టరు, సర్కిల్ ఇనస్పెక్టరు, షాహుకార్ల ఏజంట్ల మాదిరిగా అరెస్టయిన కూలీలలో విపరీతమైన దుష్ప్రచారం సాగించారు, కూలీలను నోటబట్టరాని బండబూతులు తిట్టుట, కొట్టబోవుట, బూట్ కాలితో తన్నుట, వీరికి అలవాటు అయిపోయింది. అరెస్టులో ఉండగా రాత్రి పడుకొనుటకు చాప అయినా యివ్వలేదు.

### ఆరేసినెలలు కఠినశిక్ష

కాకినాడ పీచుపనివారల సమ్మెసందర్భంలో అరెస్టు చేయబడ్డ తూ॥గో॥జిల్లా వ్యవసాయ కూలీసంఘ ప్రధాన కార్యదర్శి, జిల్లాబోర్డు మెంబరు, జిల్లాకాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహక సభ్యుడైన కామ్రేడ్ గెడ్డం మహాలక్ష్మిగారికి, తూ॥ గో॥ జిల్లా వ్యవసాయ కూలీ సంఘ సంయుక్త కార్యదర్శి కామ్రేడ్ నంబూరి శ్రీనివాసరావుగారికి, జిల్లా కాంగ్రెసు సభ్యులైన కామ్రేడ్ ఆర్. వి. జగ్గారావుగారికి, కామ్రేడ్ రామాయణం సత్యనారాయణగారికి ఆరేసినెలల కఠినశిక్ష విధించబడింది.

పీచుపనిచేయు కామ్రేడు ఆరుగుల గురపయ్యగారికి మూడు మాసములు శిక్ష విధించబడింది.

ఏప్రిల్ 17, 18, 19 తేదీలలో ఎరస్టులులేవు.

కార్మిక శాఖామంత్రి గిరిగారి ఆహ్వానంమీద పీచు పనివారల సంఘం తరపున కామ్రేడ్ సి. వి. కె. రావుగారు మద్రాసు వెళ్లారు. వర్తకుల తరపునకూడా ఒకరిద్దరు వెళ్లారు. తగాదాను పరిష్కరించి అంత్యనిర్ణయమివ్వడానికి ఆర్బిట్రేటరునుగా ప్రభుత్వం లేబర్ కమీషనర్‌ను నియమించినట్లును, వీరి నిర్ణయము సమ్మె ఆపిన రోజునుండి అమలుకు వచ్చునట్లును ఉభయపార్టీలు అంగీకరించిరి. అందుచేత సమ్మె ఆపు చేయబడింది.



# అస్సాము ఆయిల్ కార్మికుల సమ్మె

## సైనికులు తుపాకులు కాల్చారు: 4 గురు చనిపోయారు 25 మందికి గాయాలు తగిలాయి.

అస్సాము ఆయిల్ కంపెనీలో దిగ్బాయి టిన్‌సుకియా పట్టణాలలో పనిచేయు 10 వేల మంది కార్మికులు యేప్రిల్ 2 వ తేదీ నుంచి సమ్మె చేస్తున్నారు. కాని 16 దినములు సమ్మె నిర్విఘ్నముగ సాగిన తరువాత, ప్రారంభము నుంచియు కంపెని యజమానుల పక్షమున నిలచియున్న మిలిటరీ అధికారులు రాత్రి 9-30 గం॥లకు తుపాకులు కాల్చిరి. తత్ఫలితంగా 4 గురు మరణించిరి. 25 మంది గాయపడిరి. అస్సాము (కాంగ్రెస్) ప్రధాన మంత్రి కార్మికులు శాంతముగానే ప్రవర్తించుచున్నారని తెలియచేశాడు. స్థానిక కాంగ్రెస్ సంఘముల తీవ్రమైన సహకారముతో కార్మికులు సమ్మెను నడుపుకొనుచున్నారు.

### సమ్మె వివరాలు.

అస్సాము ఆయిల్ కంపెనీ యజమానులకు పనివారలకు చాలా కాలమునుంచి పనివారల కోర్కెలనుగూర్చి వివాదము జరుగుచున్నది. పనివారల యూనియన్‌యొక్క 14 నెలల ఆందోళన ఫలితముగా యజమానులు విచారణ కమిటీని నియమించుటకు అంగీకరించిరి. విచారణ జరుగు సమయమందు కార్మికులను పనిలోనుండి తొలగించుట, జుల్మానాలు విధించుట మొదలుగాగల శిక్షణ విధానమును అవలంబింపమని హామీ యిచ్చిరి. కాని అందుకు భిన్నముగా నిష్కారణముగా పనివారిని పనిలోనుండి తొలగించు చుండిరి. ఫిబ్రవరి మాసములో విచారణ కమిటీ తీర్పు తెలియచేసినది. ఇది పనివారల కోర్కెలను చాలావరకు సంకుచిత పరచిననూ, పనివారలు అంగీకరించిరి. కాని యజమానులు నెరవేర్చవలసిన భాగమును నెరవేర్చలేదు. పనివారలు యెన్ని విజ్ఞప్తులు చేసిననూ లాభము లేకపోయినది. అస్సాము ప్రభుత్వముకూడ కంపెనీ యజమానులమీద తమ తీర్పును అమలుజరుపుటకు తగినంత ఒత్తిడి చేయలేదు.

యజమానులమీద ఒత్తిడి కలుగచేయుటకు కార్మికులు యేప్రిల్ 2 వ తేదీ నుండి వారము రోజులవరకు నిరసన సమ్మె చేయుటకు పూనుకొనిరి. యజమానులు విచారణకమిటీ తీర్పును నెరవేర్చు ప్రయత్నములు చేయుటకు మారుగా ప్రస్తుతము పనిచేయుచున్న వారందరిని తొలగించి క్రొత్తవారిని పనిలో చేర్చుకొందుమని బెదరించిరి. మొదటి దినముననే నూనె కంపెనీలో పనిచేయు 6 వేలమంది కార్మికులు సమ్మెలో పాల్గొనిరి. స్థానిక, జిల్లా కాంగ్రెస్ కమిటీలు సానుభూతిని చూపుటయే కాక, ప్రత్యక్షముగా కూడ కాంగ్రెసు వాలంటీర్లు పికెటింగుయందు పాల్గొనిరి. యేప్రిల్ 7, 8 తేదీలందు కంపెని సిబ్బంది శాంతముగా పికెటింగు చేయుచున్న వాలెంటీర్లను పై అధికారుల సూచనలకు భిన్నముగా సమ్మె అతి శాంతముగా సాగుచున్నప్పటికీ, కంపెనీ యజమానులకు సహాయముగా 200 మంది అస్సాం రైఫిల్సు (సైనికదళం) వచ్చిరి. యూనియన్ అధికారులకు 144 జారీ చేయబడినది. జిల్లా మేజిస్ట్రేటు [illegible] (చిన్న

కత్తులు) వుంచుకొన కూడదని తెలియజేశాడు. అస్సాము కాంగ్రెస్-కొయలిషన్ ప్రభుత్వము విచారణ సూచనలను అమలు జరిపించుటకు యజమానుల మీద ఒత్తిడి తెచ్చుటకు మారుగా పనివారలపై నిర్బంధ విధానము అమలు జరుగుచున్నప్పుడు మిన్నకున్నందుకు స్థానిక కాంగ్రెస్ కమిటీలు, విద్యార్థి, కార్మిక సంఘములు తమ ఆసంతృప్తిని వెల్లడించిరి. స్థానిక ముస్లిం లీగ్ కూడ కార్మికులకు సానుభూతి తెలియచేసింది.

నిరసన సమ్మె ఆఖరు రోజున, యేప్రిల్ 10 వ తేదీన పనివారల కోర్కెలు నెరవేర్చెదమనియు, 10 వ తేదీన, పనివారందరు పనిలో చేరనియెడల వారి ఉద్యోగములకు స్వస్థి చెప్పవలసివచ్చుననియు బెదరించుచూ, యజమానులు ఒక బులిటెన్ ప్రకటించిరి.

### ఇతర కార్మికుల సానుభూతి

ఏప్రియల్ 10 వ తేదినుంచి యజమానుల భీకరవాక్కులకు పనివారలు బెదరకపోవుటయేకాక, ఆరోజున, కంట్రాక్టులేబరు, దొరల బంగళాలవద్ద యింటిపనులుచేయు కార్మికులు, వైద్యసంబంధమైన, జలసంబంధమైన కార్మికులు, సుమారు 4 వేలమంది సమ్మెలోచేరిరి. మొత్తము సమ్మెచేయువారిసంఖ్య 10 వేలవరకు పెరిగినది

అస్సామ్ రైల్వే ట్రేడింగుకంపెనీ యూనియన్ సమ్మెచేయుచున్న కార్మికులకు సానుభూతిని తెలియజేయుచూ, ఆయిల్ కంపెనీవారికి యేవిధమగుసహాయము చేయగూడదని రైల్వే ట్రేడింగు కంపెనీకి హెచ్చరించింది. రోజులు గడిచినకొలది యీ సమ్మెవలన యెలక్ట్రిసిటీ వుత్పత్తికికూడ ఆటంకము కలిగినది.

తేజపూరులో యెలక్ట్రిసిటీకంపెనీ సమ్మె వలన క్రూడు ఆయిల్ లభింపనందున యెలక్ట్రిసిటీ అందించజాలమని తెలియజేసిరి.

మొత్తము ఆయిలు పనివారలు 6 వేలమందిలోను యజమానుల అంచనా ననుసరించియే 30 మంది పాతపనివారిచేతను, 100 మంది క్రొత్తవారిచేతను, పనిచేయించడం ప్రారంభించారు. మిలిటరిదళము పోలీసు వుద్యోగస్తులు సమ్మెను విచ్ఛిన్నముచేయుటకు తాము స్వయముగా క్రొత్తవారిని తీసుకొనివచ్చుటకు పూనుకొనిరి. గ్యూటిన్‌సుకియా (సమ్మెపట్టణాలు) పట్టణాల్లోని ప్రజాసామాన్యమంతయూ కార్మికులకు సానుభూతి తెలియజేయుచు, యజమానులను బహిష్కరించ ప్రారంభించిరి. యజమానులకు సరుకులు, అత్యధికమగు ధరలకు విక్రయించుట ప్రారంభించిరి. యజమానులు యూరోపియన్‌లగుటవలన వారందరు అత్యధికమగు ధరలను భరించవలసివచ్చునట్లు వ్యాపారస్తులు కట్టడిచేసిరి. ప్రజలయందు కార్మికులపట్ల వ్యాపించుచున్న సానుభూతి, దొరలపట్ల అసహ్యత గమనించి, దొరలందరు వారి వారి కుటుంబములను అక్కడనుంచి పంపివేసిరి. యూనియన్ సమ్మె పరిస్థితులను తెలియజేయుచు కార్మిక నాయకులు, మహాత్మా గాంధి, బోసు, నెహ్రూ, కాంగ్రెసుప్రధాని బార్డొలాయి, శరత్ బోసు, కాంగ్రెస్ [illegible]

గార్లకు తంతులను పంపిరి. అస్సాము ప్రధానామాత్యుడు బార్డొలాయి 15, 16 తేదీలందు రాజీచేయ ప్రయత్నించి, విఫలుడయినట్లు కాల్పుల ఆనంతరము యిచ్చిన ప్రకటనవలన తెలియుచున్నది.

యజమానులు ప్రభుత్వపు సాకుగైకొని సమ్మెను విచ్ఛిన్నముచేయుటకు రాజీ ప్రయత్నములు విఫలమైనతరువాత మరింత తీవ్రముగా కృషిచేసిరి.

### రాత్రిపూట కాల్పులు.

18 వ తేది రాత్రి 9-30 గంటలకు దిగ్బాయిలో ఆయిల్ కంపెనీ సూపరిండెంటు యిద్దరు యూరోపియన్ అధికారుల సహకారముతో క్రొత్తవారిని పనిలో చేర్చుకొనుటకు ప్రయత్నించెను. కార్మికులు ప్రతిఘాలటము ప్రారంభించిరి. సంఘర్షణ జరిగిందనే నెపముతో, అక్కడవున్న మిలటరీవారు తుపాకులు ప్రేల్చిరి. ఫలితం 4 గురు మరణించిరి. 25 గురు గాయపడిరి. ఈ సంఘర్షణ నూనె కంపెనీ ఆవరణ అవతల జరిగింది. తుపాకిగుండ్లు ఒక దుకాణదారుని కొట్లో దూరినవి. పట్టణమంతయూ ఈ వార్తతో కంపించిపోయినది. ఈ కాల్పులను నిరసించుచూ జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు, కాంగ్రెస్ ఎం. ఎల్. ఏ. లు బహిరంగ సభలలో అసమ్మతి ప్రకటించారు. అస్సాము రాష్ట్రకాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు, యితర కాంగ్రెస్ యం. ఎల్. ఏలు కార్మికులు చెప్పినది యదార్థమని అక్కడ విచారణసల్పి తెలియచేసిరి. దిగ్బాయి టెన్‌సుకియా వాస్తవ్యులందరు 19 వ తేదీన హర్తాలు గావించిరి. డిబ్రూగఢ్-సిడియా రైల్వే కార్మికులు, సానుభూతి సమ్మెచేసిరి. డి. యన్. వై. రైల్వే వుదయం ఆగిపోయెందని రైల్వే అధికారులు తెలియజేసిరి. ఇతర నూనె కేంద్రములందు కూడ జనరల్ స్ట్రయిక్ జరుగునని వార్తలు వచ్చుచున్నవి. దిగ్బాయి, టెన్‌సుకియా పట్టణాలందు 144 సెక్షను ప్రకటించిరి.

అస్సాము పైనాన్సు మంత్రి 20 వ తేది దిగ్బాయికు ప్రయాణమయ్యాడు.

అస్సాము కాంగ్రెస్ కొయిలిషన్ ప్రధాని తనకు వచ్చిన రిపోర్టులను తెలియచేయుచు ప్రకటన గావించాడు. పరిష్కార కమిటీని నియమించెదమని కూడ ప్రభుత్వము తెలియచేసింది.

### కాంగ్రెస్ సహకారం.

కార్మికులు జాతీయ నాయకులకు కార్మిక నాయకులకు పరిస్థితులను తెలియచేయుచూ తంతులను పూర్వమే పంపిరి. జిల్లా కాంగ్రెస్ కమిటీ, స్థానిక కాంగ్రెస్ కమిటీలు ప్రత్యక్షముగా కార్మికులకు సహాయపడుచున్నవి. కార్మికుల ఐకమత్యము, పట్టుదలయందు ఏట్టి లోటులేదు. ఈ ఆయిల్‌పనివారల సమ్మె జనరల్ స్ట్రయిక్‌గా మారవచ్చును. కార్మికులు నిర్దోషులని రాష్ట్రకాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు కాంగ్రెస్ యం. యల్. ఏ లు ప్రకటించారు. కాంగ్రెస్ ప్రధాని బార్డొలాయి యజమానులు కార్మికుల కోర్కెలు నెరవేర్చుటకు వారి మీద అవసరమైన 144 సెక్షనుకూడ ప్రయోగించునని యూహించుచున్నారు. ఆయిల్ కంపెని యజమానులు కార్మికులకోర్కెలను నెరవేర్చని యెడల ఇది యావద్భారత సమస్యగా మారవచ్చును. అస్సాము, బర్మా ఆయిల్ కంపెనీలు బర్మా, హిందూ దేశములందు ఆయిల్ వ్యాపారమును Monopoly గా చేసుకొని కార్మికుల వేతనములను బహు సంకుచిత [illegible] విపరీతమైన లాభములు పొందుచున్నారు. కార్మికుల కోర్కెలను యీ విదేశ వ్యాపారులు నెరవేర్చుటకు ప్రతికాంగ్రెసువాది [illegible]

# ఆంధ్రరాష్ట్రంలో విద్యాలయాలు

### ఆంధ్ర రైతాంగ విద్యాలయము.

మే నెల 2 నుండి 22 వరకు

నిడుబ్రోలు

ఈ విద్యాలయపు ఆరవ సంవత్సరపు సమావేశము మేనెల 2-22 తేదీలలో సాగింపబడును. ఇచ్చట రైతాంగ సేవకై తరిబీయితు పొందగోరువారికై ప్రత్యేక శ్రద్ధ తీసుకొనబడును. రైతులు, వ్యవసాయ కూలీలు తదితర గ్రామీణుల కవసరమగుచున్న వ్యవహారములు, వారి నెదుర్కొనుచున్న సమస్యలపై తగిన శిక్షణను రైతాంగ యువజనుల కిచ్చుటకు ప్రయత్నింతుము.

గోగినేని రంగనాయకులు.
ప్రిన్సిపాలు.

★ ★ ★ ★ ★ ★

విప్లవ వీరులగు రైతు సేవకుల తరిబీయతు చేయుటకు మార్క్సు సిద్ధాంతాలను విప్లవ యోధుల చరిత్రలు, రష్యా, ప్రపంచవిప్లవముల రైతు-జమీందారీ పోరాటము, కాంగ్రెసు, రైతు కూలీ చరిత్రలును చెప్పబడును. ఈ సంవత్సరము ప్రత్యేకంగా రైతుపోరాటమును నడిపించు విధానము నేర్పబడును. సేవాదళ శిక్షణ యివ్వబడును. కావున రైతుసేవ చేయనున్న సోదరులందరు రైతు సేవకు కేంద్ర శిబిరమగు నిడుబ్రోలునకు రావలయునని కోరుచున్నాము.

పి. నాగేశ్వరరావు.
కె. బ్రహ్మయ్య.
డి. సీతారామయ్య.

★ ★ ★

### ఆర్థిక రాజకీయ వేసంగి పాఠశాల

(పల్లెకోన)

మే 1 వ తేదీన ఈ గ్రామములో ప్రారంభింపబోవు రాజకీయ పాఠశాలకు యీ గ్రామ పంచాయితీబోర్డు ప్రెసిడెంటునారైన దేవభక్తుని రామచంద్రయ్యగారు తమ విశాల గృహమును ఇచ్చుటకు అంగీకరించినందులకు మేమెంతయు కృతజ్ఞులము.

ఈ పాఠశాలకు అధ్యాపకులుగా కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణగారు బి. యే. బి. ఎల్. కామ్రేడ్ ... అమరవాది ... కృష్ణమూర్తిగారు, కామ్రేడ్ ... వావిళాల ... గోపాలకృష్ణయ్యగార్లు నియమింపబడినారు. వీరుగాక ఇతర రాష్ట్రములనుండికూడ అధ్యాపకులు వచ్చునట్లు ప్రయత్నములు చేయబడుచున్నవి. పాఠశాలకు కావలసిన ప్రయత్నములు జరుగుచున్నవి.

రేపల్లె తాలూకా యువకులు ప్రచారము గావించుచున్నారు. కాబట్టి రేపల్లె, తెనాలి తాలూకా వాసులందరు తగినటువంటి ధనసహాయము చేయవలెనని ప్రార్థించుచున్నాను.

ఇట్లు,
చదలవాడ పిచ్చయ్య.
సెక్రటరీ, ఆర్గనైజింగుకమిటీ.

# కాంగ్రెసు వార్తలు

నర్సాపురం తాలూకా కాంగ్రెసు కమిటీ.

ది 20-4-39 తేదీని నర్సాపురం తాలూకా కాంగ్రెసు సంఘ నూతన సభ్యుల సమావేశము ఉద్దరాజు రామంగారి అధ్యక్షతను సమావేశమైనది. చేకూరి అచ్యుతరామరాజుగారిని అధ్యక్షులుగాను, ఉద్దరాజు సూర్యరాజుగారిని ప్రధాన కార్యదర్శిగాను, నెక్కల పూడి రామారావుగారిని సహాయ కార్యదర్శిగాను కె. కె. సూర్యనారాయణ, కోసూరి నరసింహరాజు, దాట్లజోగి జగన్నాథరాజు, బండి మాతయ్య, రుద్దరాజు గోపాలరాజు, చేబ్రోలు వెంకటసుబ్బారావు, పోలిశెట్టి శేషావతారం, మద్దాసు దర్శనంగార్లను కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకొనబడిరి.

* * *

భీమవరం తాలూకా కాంగ్రెసు కమిటీ.

ది 20-4-39 తేదిన భీమవరం తాలూకా కాంగ్రెసు నూతన జనరల్‌బాడీ సమావేశము శ్రీయుత వేగేశ్న సత్యనారాయణ రాజుగారి అధ్యక్షతను సమావేశమై కామ్రేడ్ కృత్తివెంటి వెంకటేశ్వరరావుగారిని కార్యదర్శిగాను, కామ్రేడ్ గొట్టుముక్కల రామచంద్రరాజుగారిని సహాయకార్యదర్శిగాను ఏకగ్రీవముగా ఎన్నుకోనిరి.

కార్యనిర్వాహకవర్గం.

(1) శ్రీ ముదుండి లక్ష్మీ నరసింహ రాజుగారు (2) దంతులూరి రామరాజుగారు, (3) వేగేశ్న పెద సుబ్బరాజుగారు. (4) గొట్టుముక్కల అప్పలరాజుగారు (5) కామ్రేడ్ గొట్టుముక్కల వెంకట్రామరాజుగారు, (6) సంకు అప్పారావుగారు, (7) సాగి నారాయణ రాజుగార్లు ఏకగ్రీవముగా ఎన్నుకొనబడిరి.

తీర్మానములు.

1. తాలూకాలోగల గ్రామకాంగ్రెసు సంఘపు ఎన్నికలు మే నెల 15 వ తేదిలోపల జరిగించి రిపోర్టులు తాలూకా కాంగ్రెసు ఆఫీసుకు పంపవలసినదిగా కార్యనిర్వాహకవర్గ సభ్యులను కోరడమైనది.

2. ప్రజాస్వామికములుగల ప్రతిదేశములోనుకమ్యూనిష్టుపార్టీలు బహిరంగముగా తమ సిద్ధాంతములను ప్రచారము చేసుకొను చున్నవి. ప్రజాభిప్రాయమును గుర్తించని సామ్రాజ్యవాదులు మనదేశములో ఆపార్టీని బహిష్కరించిరి. అట్లు బహిష్కరించుట ప్రజల పౌరసత్వహక్కులకు భంగకరము. కాంగ్రెసు ప్రజాసంస్థ గావున కాంగ్రెసు ప్రభుత్వముగల ఎనిమిది రాష్ట్రములలోను ఆయారాష్ట్రములలోని కమ్యూనిష్టుపార్టీ శాఖలపై నిషేధము తొలగించుట పౌరసత్వపు హక్కులను గౌరవించుట యగును. గావున మదరాసు మంత్రివర్గమువారు మదరాసు రాష్ట్రములోని కమ్యూనిష్టు పార్టీపై నిషేధము తొలగించవలసినదిగా యీ సభవారు కోరుచున్నారు.

3. చట్టవలస కాల్పులను, లాఠీచార్జీలను ఖండిస్తూ, ప్రభుత్వమును ఇట్టి పోలీసు దుష్ప్రవర్తనలను అరికట్టవలసినదిగా కోరుతూ మరియొక తీర్మానము చేయబడెను.

* * *

ప॥ గో॥ జిల్లా కాంగ్రెసు సంఘము.

ది 18-4-39 తేదీ మధ్యాహ్నము 11 గం॥ జిల్లా కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారు శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారి అధ్యక్షతక్రింద సమావేశమయి గావించిన తీర్మానములు:

1. కార్యదర్శుల కార్యక్రమ విభజన:—జిల్లాలో రైతు, కూలీలకు సంబంధించిన పనులను చూచుకొనుటకు శ్రీ పేటేటి వెంకటరత్నంగారిని; స్థానిక సంస్థలు అనగా జిల్లా బోర్డు, మున్సిపాలిటీవారు, పంచాయతీలు, బ్యాంకులు మున్నగు స్థానిక సంస్థల గురించి వ్యవహరించుటకు శ్రీ కొమ్మారెడ్డి చిన ఆంజనేయులుగారిని నియమించడమయినది.

2. లంచగొండితనము నిర్మూలించుటను గూర్చి:—జిల్లాలో లంచగొండితనమును గూర్చి విచారించుటకు యీ దిగువ వారిని ఒక కమిటీగా యేర్పరచడమైనది.

1. దండు నారాయణరాజు, 2. ఆత్మకూరి గోవిందాచార్యులు. 3. పోడూరి పేర్రాజు, 4. కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి (కన్వీనరు) 5. తల్లాప్రగడ ప్రకాశరాయుడుగార్లు.

3. కాళీపట్నపు సబ్ కమిటీ రిపోర్టు:—జిల్లా సంఘమువారు 19-3-39 తేదీన కాళీపట్న వ్యవహారంలను గురించి వ్యవహరించుటకు యేర్పరచిన సబ్ కమిటీ తరపున కన్వీనరుగారైన దండు నారాయణ రాజుగారు దాఖలుచేసిన నివేదికతో సంపూర్ణముగా యీ సంఘమువారు యేకీభవించుచున్నారు. వారు ఈ వ్యవహార సంబంధమున చేసిన కృషిని అభినందించుచున్నారు. యికముందు కాళీపట్నం జమీందారు రైతుల వ్యవహారము పరిష్కరింపబడువరకూ, యీ దిగువ వారిని యుపసంఘముగా నియమించుచూ సదరు ఉపసంఘమునకు వ్యవహారకర్తగాయుండి అవసర చర్య జరుపుటకు శ్రీ దండు నారాయణరాజుగార్కి అధికారమివ్వడమయినది.

కమిటీ సభ్యులు:—1. శ్రీ దండు నారాయణరాజు 2. శ్రీ ఉద్దరాజు రామం 3. భూపతిరాజు లక్ష్మీ నర్సరాజుగార్లు.

కాళీపట్నములో పోలీసువారిచే జరుపబడిన అత్యాచారముల నీ సభవారు ఖండించుచూ, యీ అత్యాచారములను గురించియు, వేలూరు జైలులో కాళీపట్టణమునందు బంధింపబడిన స్త్రీలు కొట్టబడిరనే విషయమును గురించియు తగు విచారణను సలుపవలసినదిగా యీ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

4. మద్రాసు శాసనసభోపసంఘమువారి యెదుట నున్న మద్రాసు విక్రయముల పన్ను యందలి సూత్రమును యీ సంఘమువారు ఆమోదించుచూ, సదరు పన్ను పంటదినుసులు పండించే వ్యవసాయదారులపైననూ, గృహపారిశ్రామికముల పైననూ, పడకుండా శాసనములోను దానిని అనుసరించి చేయబడు నిబంధనలలోను తగు యేర్పాటులు చేయవలయునని మద్రాస్ కాంగ్రెసు ప్రభుత్వమును, శాసనోపసంఘమును, శాసన సభ్యులను కోరుచున్నారు.

5. కాకినాడలో బీడు కార్మికులు న్యాయమైనహక్కులకొరకు శాంతముగా చేయుచున్నసమ్మె సందర్భములో పోలీసులు లాఠీఛార్జిని యీసభవారు ఖండించుచున్నారు.

6. ప్రస్తుతము జిల్లాకాంగ్రెస్ సేవచేయుచున్నటువంటిన్ని, క్రిందటి సంవత్సరము జిల్లా కాం॥ సంఘాధ్యక్ష కార్యదర్శులైన అల్లూరి సత్యనారాయణ, గారపాటి సత్యనారాయణగార్లపై నున్న నిషేధమును వెంటనే తొలగించవలసినదిగా రాష్ట్రసంఘము వారిని యీ సభవారు కోరుచున్నారు.

7. ప్రకాశం కమిటీనివేదిక జూన్ మాసాంతమునకయినా బిల్లురూపమున ప్రకటించ వలయుననియు, ప్రకాశం కమిటీ నివేదికకు ఆం॥ రా॥ రైతుసంఘము వారి సవరణల యందలి లాభములను రైతులు పొందుటకు వీలగునటుల శాసనమొనర్పబడ వలయునని యీసభవారు మంత్రివర్గమును, శాసనసభ్యులను కోరడమయినది.

8. వ్యవసాయ కూలీలకు ప్రత్యేక ఋణచట్టము చేయబడునని ప్రభుత్వము వాగ్దాన మొనర్చియు యింతవరకూ చేయక పోవుటవలన వ్యవసాయ కూలీలకు కాంగ్రెస్ ప్రభుత్వముపట్ల అసంతృప్తికి కారణమగుచున్నదని యీసంఘమువారు అభిప్రాయపడుచూ, వ్యవసాయ కూలీల ఋణవిమోచనమునకు అవసర శాసనచట్టమును జూన్ మాసాంతమున కయిననూ, ప్రకటించవలయుననియు, వ్యయసాయ కూలీల, కవులుదార్ల ఆర్థిక పరిస్థితులను ఒక కమిటీ ద్వారా విచారించి వారి జీవితసౌకర్యముల కవుసరమగు కనీసవేతనము మక్తానిర్ణయములు మున్నగునవి ఏర్పాటులు గావించుటకు శాసనములను యీ సంవత్సరాంతమున చేయవలెనని యీ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

పశ్చిమ గోదావరి జిల్లా వాలంటిరు శిక్షణా శిబిరము.

9. మన రాష్ట్రములో యీ సంవత్సరము కనీసము 10 వేల వాలంటీర్లకు ప్రాథమిక రాజకీయ జ్ఞానమును హిందూస్థానీ సేవా దళ శిక్షణమును యిచ్చుటకు తగు యేర్పాటులు చేయవలసినదిగా రాష్ట్ర సంఘమువారినికోరుచున్నారు. యీజిల్లాలో యీసంవత్సరము ఆయా తాలూకాలలో వాలంటీరు శిక్షణాశిబిరములను ఏర్పాటు చేయుటకు తీర్మానించుచూ, సదరు యేర్పాటులు గావించుటకుగాను అధ్యక్షులకు, ముగ్గురు కార్యదర్శులకు అధికారమివ్వడమయినది.

మే నెలలో జిల్లా వాలంటీరు శిక్షణా శిబిరమును ఏర్పాటు చేయుటకును దానికివలయు యావత్తు యేర్పాటులు చేయుటకు అధ్యక్షులకు, ముగ్గురు కార్యదర్శులకు అధికారమీయడమయినది.

రానున్న స్వాతంత్ర్య పోరాటమునకు సుశిక్షితులగు వాలంటీరులు అత్యవసరము గాన మే నెలలో జిల్లా కాంగ్రెసు సంఘ యాజమాన్యమున ఏర్పాటు కాబోవు శిక్షణా శిబిరమునకు స్వాతంత్ర్య ప్రియులందరు వాలంటీర్లుగా చేరియు, శిబిర నిర్వాహణకవసరమగు ధన సహాయముచేసియు, శిబిరము జయప్రదమగునట్లు, సర్వవిధముల తోడ్పడవలసినదిగా జిల్లా వాసులెల్లరిని యీ సభవారు కోరుచున్నారు.

ఇట్లు
కొ॥ సత్యనారాయణమూర్తి,
అధ్యక్షుడు.

* * *

ఫెడరేషను ప్రతికూల నేషనల్ డిమాండ్సు ప్రచార సంఘములు

జాతీయ మహాసభవారి ఆజ్ఞానుసారము, యుద్ధ ప్రతికూల ప్రచారము, త్రిపురికాంగ్రెసులో అంగీకరించబడిన నేషనల్ డిమాండు రిజల్యూషనును గురించి ప్రచారము, చేయుటకు జిల్లాకాంగ్రెసు సోషలిస్టు పార్టీవారు జట్టుల నేర్పాటుచేసిరి. వారు జిల్లా అంతట ప్రచారము చేయుదురు. ఆజట్టులు గ్రామములకు వచ్చినపుడు ప్రజలు వారికి సహాయముచేయ ప్రార్థితులు. తాలూకా గ్రామ కాంగ్రెసు సంఘములు పైజట్టులకు అన్నివిధముల సహాయము చేయ గోరుచున్నాను.

మం. వెంకటరాజు,
గుం॥ జిల్లా॥ కాం॥ అధ్యక్షుడు.



# పాటలు—పద్యాలు

## ధర్మం

(విశ్వం)

పుస్తకమందూ
మందిరమందూ
అక్షతలందూ
వైభవమందూ
సంపదలందూ
భజనలయందూ
గంగాజలమున
యజ్ఞగుండమున
ఆహారంబున
వ్యవహారంబున
జంఝ్యాలందున
ధర్మం నాస్తి!

దొరలను దీనుల
యొకటిగజూచుట
యేరికి కష్టం
యివ్వకనుండుట
దేశోన్నతిలో
పుడకవ కుండుట
విశ్వప్రేమనే
జగతిలొ నింపుట
జీవులకెల్లా
సాయంజేయుట
ధర్మం. యిదిగా
నిజమగు ధర్మం

కపటాచారం
ధర్మం నేర్పదు
హత్యలుచేయగ
మత్తొయివ్వదు.

★

## సామిధేని

(శ్రీరంగం నారాయణబాబు)

రక్తపతాకం
శక్తినాలుక
అగ్నికిరీటం
ఆకాశమున
మునిమాపు
పిలిచింది;

కాలం నాగు
వినువీధుల్లో
వెన్నెల పడగ
విప్పింది;

శారదరాత్రి
శంకరుఫాలం
బూదిపవిత్రత
బూరా ఊదింది

దేహం వీడి
దేశం వీడవు
దిక్కుల ఉరి
కొయ్యల నుండి

దేశనాయకుల
ప్రాణాలు
మూగగాలులు
మూటగులు
వీణాయి

హంతకుచేతిని
కత్తులు
వింతహృదయమున
భావాలు
......................

శిరసున
రతనము
గళమున
విషమ్ము
కలమ్ము
కొసలొ
కాటుక
మబ్బులు
కాగితమె
కంపించింది!

పాటే
గ్రహపాట?

సూరన
అడిదాన్ని!
తిక్కన
ఖడ్గాన్ని!
పేలిన
బిజాపూరు
ఫిరంగిగుండు
నాగుండె!

—రుధిరజ్యోతినుండి.

★

## ఒడుదుడుకులు.

(నారపరెడ్డి రామిరెడ్డి.)

తోడి మానవు లాకట మాడుచుండ
ధనిక ముష్కరుడొకడు విత్తంబునెల్ల
గుళ్ళగోపురాలకు బెట్టి గొప్పకొరకు
రాతిబొమ్మల కుత్సవాల్ ప్రబలజేయు॥

శ్రమికజీవుల కష్టాల సంగ్రహించి
దివ్యసౌధాల హాయిలో దేలునొకడు
కష్టజీవికాతని దయా దృష్టికొరకు
వీధి పంచలప్రాణాలెవిసిగిపోవు॥

చలికి వానకు నెండకు నిలువలేక
గుడిసెకై యొక్క దీనుడు కుందుచుండు
ఐందవోపలరమ్య హర్మ్యాలలోన
తూగుటూయెలలం దొకడూగుచుండు॥

మండుటెండల కష్టించి కండలరుగ
పొట్టగడవక అల్లాడి పోవునొకడు
చల్లదనముకొరకు వేలు కొల్లబెట్టి
కొండలను జేరి నీటుగా గులుకునొకడు॥

మానమునుగాచుకో జీర్ణమలినవసన
మైన దొరకక కొందరల్లాడుచుండ
పట్టువల్వలకై వేలు పాడుజేసి
తనదు ఘనతను ప్రకటించు మనుజుడొకడు॥

ఎముకలరుగ కష్టించి పండించునట్టి
రైతుబిడ్డనౌర! మొరటురాయుడనిరి
వానికష్టంబు హరియించి తానుమెక్కి
తిరుగు మోసాత్మ ప్రభునిగా పరిగణింతురి॥

ఎవ్వరో స్వార్థపరులు సృజించినట్టి
పాడుసంఘము మనుజుల గోడువెట్టి
హెచ్చుతగ్గుల గల్పించు నీజగాన
బ్రతుకుతీపని పల్కిన పాపియెవడు॥

★

## భోగిమంటలు

(విష్ణు)

మంటలే - మంటలే!
ఆ పెద్ద - మంటలే!
భుగభుగా -
మంటలతో,
భగభగా
జ్వాలలతో
మిన్నంట
నాలుకలు
దిశలంట
బాహువులు
భువినుండి
కాలాగ్ని
భగ్గున్న
లేచింది.
మంటలే - మంటలే!
అవిభోగి - మంటలే!

2

నెగడులే - నెగడులే!
ఆ పెద్ద - నెగడులే!
పటాపటా
ధ్వనులతొ
చిటచిటా
ధ్వనులతొ
గబగబా -
రెపరెపా -
జ్వాలలే
లేచాయి,
ధగధగా
మెరపులతో,
నాలుకలు
గ్రక్కుచూ,
పిల్ల తాచుల్లాగ
మిన్నుకెగిశాయి,
నెగడులే - నెగడులే!
అవిభోగి - నెగడులే!

3

జ్వాలలే - జ్వాలలే!
ఆ పెద్ద - జ్వాలలే!
కరకరా
యెండలో
గలగలా
ఎండినా,
కర్షకుల
యెముకలే,
ఆ....యగ్ని
సమిధలు,
సురసురా
అగ్నిలో
సలసలా
కాగినా
కార్మికుల
రక్తమే,
ఆ....యగ్ని
ఘృతము,
జ్వాలలే - జ్వాలలే!
అవి భోగి - జ్వాలలే!

4

వీనమే - వీనమే!
ఆ పెద్ద - వీనమే!
పూరుపూరుల్లోను
మండినా -
మంటలూ,
లేచినా -
జ్వాలలూ,
దీనులపాలిటి
దివ్యదూతలు
పైరు -
గాలులగూడి
పైనమైనాయి
ఆక లాకలి
యంటు
అడిలాయి.
దిశలెల్ల
అప్తు
లెవ్వరులేక
అరిచాయి
ఏకముగ
మనలేక
భువిలోను
ఎగిశాయి
దివికి
ఆక లాకలి
యంటు
వ్యోమ
వీధుల్లోన
వీనమే - వీనమే!
అదిపెద్ద - వీనమే!

## నిర్మాణ సమస్యలు

ఫెడరేషన్‌కు వ్యతిరేకంగా పోరాటము సాగించడానికి దేశములో సన్నాహాలు జరుగుతున్న సమయములో నిర్మాణావశ్యకతనుగూర్చి ప్రత్యేకముగా తెలుపనవసరములేదు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారిచే ప్రకటించబడిన ఈ పుస్తకము. స్వాతంత్ర్య యోధులకు ఈ నిర్మాణ సమస్యను పరిష్కరించడానికి అనేక సూచనలిస్తుంది. వెల అణా. వెంటనే నవశక్తి ఆఫీసుకు వ్రాయండి.

## నవశక్తి

మొదటి సంవత్సర వాల్యూమ్
కొద్ది ప్రతులే ఉన్నవి.
5 రూపాయలు
నేడే వ్రాయండి.

# మే దినోత్సవము

మే ఒకటి దగ్గర కొచ్చుచున్నది. ఆనాడు కార్మికుల పండుగ. ఒక రాష్ట్రీముగాదు దేశముగాదు – ప్రపంచ మంతటా కార్మికులు ఆ రోజును వుత్సవ దినంగా పరిగణించుతారు. ఆరోజున ప్రతి దేశములోను ఎన్నో సంఘర్షణలు ఎన్నో పోరాటములు ఎట్టిబెందా క్రింద జరిగాయి. ఈ పోరాటఫలితంగా సంపూర్ణ జయము లభించక పోయినప్పటికిని, కార్మికులలో ఐక్యత, సంఘటితశక్తి పెంపొందినది. అంతర్జాతీయ కార్మికోద్యమమందు యైక్యతగూడ పొడచూపినది.

కాని గత 10 సంవత్సరములాదిగా ప్రపంచ పరిస్థితులు చాల వేగముగా మారుచున్నవి. ప్రపంచ ఆర్థికక్షోభలో ప్రపంచ పరిస్థితులు తారుమారయ్యాయి. పెట్టుబడిదారీ విధానము తీరని నష్టము పొందుటచే తమ లాభాలను నిలబెట్టుకోవడముకొరకు ప్రజాసామాన్యమును ముఖ్యముగా కార్మికులను మరింత దోచుకు తినడం ప్రారంభించినది. ఇట్లు చేయుటకుగాను పెట్టుబడిదారీ విధానముయొక్క స్వభావాన్నంతా వెల్లడి గావలసివచ్చినది. కార్మికుల పోరాటములను అణచుటకుగాను, తమ లాభాలను యెట్లయినను నిలబెట్టుకొనుటకు బహిరంగ నిరంకుశాధికారాలను (నాజీజము, ఫాసిజము పద్ధతులను) అవలంభించారు. నాజీజము, ఫాసిజము అంకురించడముతో ప్రపంచములో విపరీత పరిస్థితు లేర్పడెను. ప్రపంచ శాంతికే భంగము గల్గినది. బలహీన రాజ్యముల అస్తిత్వమే మొగిరిపోయినది. ప్రపంచాన్నంతా యుద్ధ మేఘాలు ఆవరించినవి. సామాన్య పౌరసత్వ హక్కులకే స్థానము లేకుండా పోతూఉంది. అందుచే నాజీజము, ఫాసిజమును ప్రపంచమంతటా వ్యాపించకుండ, ఫాసిస్టు ప్రతికూల వుద్యమము చాల అవసరమయ్యెను. సామాన్య పౌరసత్వ హక్కులకొరకు పోట్లాడుట అవసరమయ్యెను. అందుకు ప్రపంచములోనున్న శాంతిని కోరేవారు, యుద్ధప్రతికూలురను, ఫాసిస్టు ప్రతికూలురందరిని ఐక్యపరచి యొక బలిష్టమైన ఫాసిస్టు ప్రతికూల వుద్యమమును లేవదీయుటతోనూ, దానిని ప్రతిదేశంలోను వ్యాపింపచేయుటతోనూ అంతర్జాతీయ కార్మిక లోకము గత 4, 5 సంవత్సరముల నుండి తీవ్రకృషి చేయుచున్నది. కొంతవరకు సఫలత పొందుచున్నదిగూడాను. ఈ సంవత్సరాలల్లో మే దినోత్సవాలు, ప్రదర్శనాలు యీ పై నినాదములోనే నిండియున్నవి.

1939 వ సంవత్సరము నాటి "మే" దినోత్సవము ప్రపంచమంతటా ఫాసిస్టు ప్రతికూల నినాదములతోను, యుద్ధ ప్రతికూల నినాదములతోను నిండియుంటుంది. ఈ పరిస్థితులలో మన భారతదేశములో యీ సంవత్సరం మే దినోత్సవము యెట్లు జరపాలి?

భారతదేశములో 20 సంవత్సరాల నుండి తమ వర్గ హక్కులకొరకూ, తమ ఐక్యత కొరకూ యెన్నో పోరాటాలు సల్పి యీనాటికి కొంతవరకు ఐక్యత పొందగల్గారు కార్మికులు. తమ ఏకైక వర్గసంఘమును నిర్మించుకొన్నారు. ఈ నాడు భారతజాతిలో యొక బలిష్టమైన సంఘటిత శక్తిగా కార్మిక శక్తి పరిగణింపబడుచున్నది. అంతర్జాతీయముగా ఫాసిజమ్, నాజీజమ్ యెట్లు అంతర్జాతీయ కార్మికులకు ప్రథమ శత్రువులో, అట్లే భారతదేశములో సామ్రాజ్యవాద ప్రభుత్వమైన బ్రిటిష్ ప్రభుత్వం భారత కార్మికులకు తమ విమోచనా ప్రయత్నములలో అది గడుగుడూ అడ్డొచ్చుచున్నది. అందుచే బ్రిటిష్ ప్రభుత్వమును రూపుమాపుట ప్రథమ ధర్మముగా తలచారు. దేశములో ముఖ్యమైన రాజకీయ సంస్థయైన కాంగ్రెసుతో కలసి, జాతీయ ఐక్యతను పెంపొందించి జాతీయ వుద్యమ అభివృద్ధికి తోడ్పడుచున్నారు.

ఈ సంవత్సరం చాల ప్రాముఖ్యమైనది. జాతీయ కాంగ్రెసులో చాల తీవ్రమార్పులు జరుగుచున్నవి. బ్రిటిష్ప్రభుత్వం బానిసరాజ్యాంగమైన ఫెడరేషనును ప్రజలపై రుద్దనున్నది అందుకు వలయు కట్టుదిట్టములన్నీ తయారయినవి. మరొక స్వాతంత్ర్య సమరమాసన్నమైనది. కాంగ్రెసు ప్రజలను సమరమున కాయత్తము కమ్మని ఆజ్ఞ యిచ్చినది. ప్రజాభీష్టమైన కాన్‌స్టిట్యూయంట్ అస్సెంబ్లీనియేర్పరచవలసిన కాలము వచ్చినదన్నది. కాని యిట్టి సమరమునకు వలయు సాధన సంపత్తితో ముఖ్యమైన జాతీయైక్యతను కాంగ్రెసు యింకను కుదర్చలేక పోతూవుంది. ఈ సమయములో మే దినోత్సవము వచ్చినది. యీ వుత్సవము జాతీయోత్సవముగా జాతీయైక్యతను ప్రదర్శింప చేసే ప్రదర్శనాలతో నిండివుండాలి. జాతీయ శక్తులన్నిటిని యీ మే దినోత్సవ ప్రదర్శనముల ద్వారా ఐక్యతపర్చగలగాలి. ఇదే యీ సంవత్సరపు మే దినోత్సవముయొక్క ఆశయము. ఇందుకు ముఖ్యంగా కార్మిక సంఘాలు, సోషలిస్టులు యిప్పటినుండే తీవ్ర ప్రయత్నము చేయాలి. కాంగ్రెసు సంఘాలు, తదితర ప్రజా సంఘాలు పూర్తిగ పాల్గొనేటట్లు చేయాలి. ఈ ప్రదర్శనములో యెంత ఐక్యతతో పనిచేసి యెంత ప్రజాపదర్శనముగా చేయగల్గిన అంతవరకు జాతీయైక్యతను పొందగల్గుతాము. స్వాతంత్ర్య వుద్యమమును అప్పుడే తీవ్రపర్చగలుగుతాము.

చెలసాని వాసుదేవరావు,
కార్యదర్శి, అం॥ రా॥ రైతుసంఘం,

పు. సుందరయ్య,
కార్యదర్శి, ఆం॥కాం॥ సోషలిస్టుపార్టీ,

పిల్లలమర్రి వెంకటేశ్వర్లు,
కార్యదర్శి, అం॥ ప్రెస్‌వర్కర్సు యూనియన్.

# గమనించండి

## యం. యస్. యం. రైల్వే పనివారల సంఘం,

బెజవాడ బ్రాంచి.

కామ్రేడ్,

బెజవాడ బ్రాంచి యూనియన్ సంవత్సరాంతర మహాసభ
1939 ఏప్రియల్ 30 వ తేదీ ఆదివారమున రైల్వే కాలనీలో జరుగును గాన
మీరు తప్పక రావలసినదిగా ప్రార్థించుచున్నాను.

కామ్రేడ్, యం. పున్నారెడ్డి
యం. యస్. యం. రైల్వే పనివారలసంఘం ఉపాధ్యాక్షులు అధ్యక్షత వహించెదరు.

బెజవాడ,
15—4—1939.

ఇట్లు,
ఆర్. వి. సుబ్రహ్మణ్యం,
ఆహ్వాన సంఘాధ్యక్షుడు.

షరా:—ఆరోజున హాజరైన ప్రతినిధులకు భోజనవసతులు వుచితము.

## గంగాధర రామారావు పేట

### రైతుకూలీల యిబ్బందులు

శీరంశెట్టి అప్పలస్వామిగారు యిట్లు వ్రాయుచున్నారు.

పందలపాక గ్రామములో పిఠాపురం జమీందారుగారి తండ్రిగారైన, గంగాధర రామారావు గారి పేరిట యొక పేటకలదు. జమీందారుగారి యందుండే అనురాగమున యీపేటలోని ప్రజలు గంగాధర రామారావు పేట అని పేరిడిరి. కాని, ఆ పేటలోని స్థలములు జమీందారు గారివికావు. యీపేటలోని రైతులు, కూలీలు, పడుచున్న అవస్థలు చెప్పశక్యముకాదు. యీపేటలో సుమారు 800 యిండ్లున్నూ, 2000 జనాభాయున్నూ గలిగి, ఆ ప్రజలు ఒకప్రక్క జమీందారుగారి చేతను, మరియొక వైపు పెట్టుబడిదార్ల చేతను, బాధింపబడుచున్నారు. ఈకూలీలు నివసించుచున్న యిండ్లు వీరితాతతండ్రులు,ఏనాడో కట్టియున్నారు.అయిండ్లలోనివశించుచున్నప్రజలకు జమీందారుగారిఆజ్ఞయైనది. యెస్టేటు వుద్యోగస్థులువచ్చి, యిండ్లన్నియు కొలతలువేసి, సెంటు 1కి $3\frac{1}{2}$ రూపాయలు చొప్పున పన్నుచెల్లించుకొనవలెననియు పన్ను యివ్వనియెడల కొంపలు వేలము వేయబడుననియు, యీ స్థలములు జమీందారుగారివనియు, గ్రామమంతయు అల్లకల్లోలము చేసిరి. యీ బాధచే రైతులు భయమొంది పరితపించుచుండ "గోరుచుట్టుమీద రోకలిపోటు" అన్నట్లు యిప్పుడు ఆ స్థలములు జిల్లా బోర్డువారివనియు, జిల్లా బోర్డువారు ఆ స్థలముల నాక్రమించుకొందురనియు, వదంతి యున్నది అధికారుల చర్యలవలన పేటలోని రైతులు, కూలీలు ఇకముందేమి జరుగునోయని తల్లడిల్లుచున్నారు.

### పంచాయితీ బోర్డు పరిపాలన.

పందలపాక, పంచాయితీ బోర్డుకు సాలీనా సుమారు 500 రూపాయల ఆదాయమువచ్చుచున్నప్పటికీ, గ్రామ సౌకర్యముకొరకై, కృషి చేయకపోవుట కడుశోచనీయము.

యీపేటలో 800 యిండ్లున్నూ, 2000 జనాభాయున్నూ గలిగి ప్రజలు మంచినీటి సదుపాయములేక తహతహ లాడుచున్నారు. ఒక మంచినీటి బావియైనను లేదు. గోదావరి కాలవ నీరే గతియగుచున్నది. ఆ గోదావరి కాలవలో నీరు యెల్లపుడుయుండదు. వేసవిలో పూర్తిగా యెండిపోవును. దానికితోడు యీ పేటయందు అగ్నిభయము మెండు. త్రాగుటకైనా నీరు సదుపాయములేని యీ పేటలో అగ్నిదేవు డుదయించగనే యీ బీద ప్రజలు అనుభవించు కష్టములు భీషణరూపమును దాల్చుచున్నవి.

గ్రామ పంచాయితీసొమ్ము ఖర్చుపెట్టి ప్రజలకు ఉచిత వైద్యము చేయుటకు, ఒక డాక్టరు గారిని తీసుకవచ్చి, పంచాయితీ పెద్దల యింటి సమీపమున ఆసుపత్రి యేర్పరిచిరి. నామిత్రునకొకనికి జబ్బు చేయుటచే మందు యిచ్చెదరను ఆశతో, ఆసుపత్రికిపోయి మందు యివ్వమని కోరగా, మీజాతి, పశువులు త్రాగినట్లు త్రాగెదరని దూషించి మందు యివ్వకుండా తలుపులు వేసిరి. నిరుత్సాహముతో యింటికి పోయితిని.

రాలపల్లి అప్పన్న యితడు పిప్పిపన్ను బాధకు తాళజాలక, పన్నుతీసి నన్ను రక్షించమని అనేక విధముల పరితపింపగా, డాక్టరుగారు కరుణార్ద్ర హృదయులై, అణా డబ్బులు తెచ్చుకొనినయెడల నీ పన్నుతీసి బాధను పోగొట్టెదనని చెప్పిరి. పంచాయితీబోర్డువారు చేయించు ఉచితవైద్యము ప్రజల కీవిధమున ఉపయోగపడుచున్నది. పంచాయితీవారు యిప్పటికైనా యీ పేదజనులయందు దయయుంచి ప్రజలకు మందులిప్పించి, ప్రజలను పశువులుగా చెయ్యవలదని ప్రార్థన.

★ ★ ★

### ఆయకట్టులో చేర్చబడవలసిన భూములు.

గత ఆయకట్టు నిర్ణయములో జరిగినలోపం వల్ల ఆయకట్టులోచేర్చ నర్హమైన పెక్కు భూములు చేర్చబడకపోవుటచే పల్లపుసాగు చేయబడుచున్నందుకు అట్టి భూములపై అపరాధపు పన్నులు విధింపబడుచున్నది.

ఈ సంవత్సరం తిరిగి ఆయకట్టు నిర్ణయించేయు ప్రయత్నములు జరుగుచున్నవి. నూతనంగా 20000 యకరములు ఆయకట్టులో చేర్చబడనున్నట్లును, లోగడ పల్లపుసాగు చేయబడుచూ అపరాధపు శిస్తులు చెల్లింపబడుచున్న భూములు ముందుగా అభిమానింపబడుననియు, అపైని ఆయకట్టుగో చేరిన పల్లం భూముల మధ్యనున్న మెరకభూములు అభిమానింపబడుననియు, అభరున పల్లంభూముల ప్రక్కనున్న మెరక భూములు చూడబడుననియూ శ్రీకృష్ణా ఈష్టరన్ డెల్టా యగ్జిక్యూటివు ఇంజనీయరుగారు తెలియపరచి యున్నారు.

కాబట్టి రైతులు తమ భూముల స్వభావము చెల్లించుచున్న అపరాధపు పన్నులు, సర్వే నెంబరు, ప్లాను వగైరా వివరములతో సహా దరఖాస్తులను కృష్ణాజిల్లా కలెక్టరుగారి కొకకాపీని కృష్ణా ఈష్టరన్ డెల్టా యగ్జిక్యూటివు ఇంజనీయరుగారి కొకకాపీని పంపుకొనవలెను.

కామినేని వెంకటప్పయ్య,
కృష్ణాజిల్లా రైతు సంఘాధ్యక్షులు.



# బాల్కన్ రాజ్యాలపై ఫేసిస్టు ప్రభావం

## రష్యాతో చేరడానికి ఇంగ్లండు ఇంకా సందేహించుతున్నది
## యుద్ధ భయంతో నిరంకుశాధికారం ఎక్కువైంది

రూజ్‌విల్టు శాంతి సందేశానికి జవాబు హిట్లరు 28 వ తేది ఇవ్వడానికి నిశ్చయించుకున్నాడు. ఆరోజున జర్మనీను పార్లమెంటును (రీచ్‌స్టాగును) కూడ సమావేశ పరుస్తాడు. ప్రస్తుత అంతర్జాతీయ స్థితికి కారణము రష్యా. తన కాలనీల సమస్యను పరిష్కరించాలి. బాల్కనురాజ్యాలలో తన ఆర్థిక కార్యాలకు వ్యాపారానికి అడ్డురాకూడదు తన్ను చుట్టూ ముట్టడించడానికి చేసే ప్రయత్నాలు మానాలి అప్పుడే శాంతికి తానుకూడ గ్యారంటీ ఇవ్వగలమని హిట్లరు తెలియజేస్తాడని వార్తలు వస్తున్నాయి.

ఇటలీ పత్రికలు రూజ్‌విల్టును తీవ్రంగా ఖండించాయి. రూజ్‌విల్టు సందేశము నంగీకరించకూడదు. అతని సందేశములో ఇటలీ జర్మనులను దాడివెడలే రాజ్యాలుగ పరిగణించడము చిలిపితనము. కేవలము యుద్ధ ప్రకటనగా ఉంది. ఇవి ఇటలీ పత్రికలలో వ్రాతలలో మచ్చుకు కొన్ని ఉదాహరణాలు.

ఫ్రాంసు ఇటలీ కోర్కెలను తృణీకరిస్తూ ఉంది. జర్మనీని బ్రిటను బెదరిస్తూవుంది. అందుచే యుద్ధరంగము పశ్చిమ యూరపుకు పశ్చిమ మధ్యధరా సముద్రానికి మారింది. అందుచే తూర్పురంగాన బాల్కన్ రాజ్యాలలో తమకు వ్యతిరేకంగా కుట్రలుసాగించే కేంద్రాలను లేకుండజేసుకోవాలి. ఇకముందు మిగిలిన బాల్కను రాజ్యాలు ఈలాగు కుట్రలు చేయకుండునట్లు షరతులు విధించాలి. అని మరియొక ఇటలీపత్రిక ఇటలీ జర్మనుల ప్లానులను తెలియజేసింది.

జర్మనీ రూజ్‌విల్టుకు సమాధానము చెప్పడానికి ముందు, చిన్న రాజ్యాల నన్నింటిని రెండు ప్రశ్నలు వేసింది. ఒకటి రూజ్‌విల్టు సహాయము అవి అపేక్షించినవా? రెండవది జర్మనీ తమపై దాడి వెడలుననే భయముందా? ఇంతవరకు జవాబిచ్చిన దేశాలన్నీ, రూజ్‌విల్టు తమకు ముందుగా ఏమీ చెప్పకయే ఆ సందేశాన్ని పంపించాడని చెప్పాయి. స్విట్జర్లండు తన తటస్థత అన్ని రాష్ట్రాలు గుర్తించి దానిని ఉల్లంఘించకుందురని నమ్మకము ఉంది. కాని ఆలా ఏ దేశమైనా ఉల్లంఘిస్తే యుద్ధము చేస్తామన్నది. జర్మనీ నుండి దాడి వస్తుందని తామనుకోవడము లేదు. కాని ఇప్పటి పరిస్థితు లిదే రకంగా మరికొంతకాలము ఉంటే యుద్ధము వస్తుందని తన సందేహాన్ని హాలండు వెల్లడించింది. ఈజిప్టు తనపై మరే దేశము దాడి చేస్తాయని భయము లేకపోయినా, దాడులకు వ్యతిరేకంగా చేసుకొనే ఒడంబడిల కన్నిటికి తామనుకూలమేనని తెలియజేసింది. ఫిన్‌లాండు, లిథూనియాలు, తమపై జర్మనీ దాడి వెడలుతుందనే అనుమానముకూడ కలుగలేదన్నాయి. ఈ జవాబులన్నింటిని ఉదహరిస్తూరూజ్‌విల్టును హిట్లరు పరిహసిస్తాడు!

ముసోలినీ, ఏట్టి జవాబులకు ఎదురుచూడకనే రూజ్‌విల్టుకు జవాబుగ ఒక ఉపన్యాసమిచ్చాడు; తాము ఏ దేశాన్ని ఆక్రమించదలచుకోలేదు. కాని 10 యేండ్లవరకు శాంతిని భద్రముగావిస్తామనే పరస్పర హామీ అసందర్భమయిందన్నాడు. అమెరికా సూచించినట్టి పెద్ద కాన్ఫరెన్సులు నిష్ప్రయోజనము అని ప్రకటించాడు.

బ్రిటిషు ఫ్రెంచి ప్రభుత్వములు, జర్మనీ ఇటలీలకు వ్యతిరేకంగా బాల్కను రాజ్యాలను ఒకటిగా చేయడానికి గావించే ప్రయత్నాలను భగ్నము కావించుటకు ఇటలీ జర్మనులు తీవ్రముగా పనిచేయ మొదలుపెట్టాయి.

బల్గేరియా ఇటలీ జర్మనులతో కలసి, రుమేనియా, గ్రీసులను, తనకు భూప్రదేశముల నిమ్మని ఏవిధంగా అడుగుతుందీ గతవారము చూచాము.

రుమేనియా విదేశాంగ మంత్రి గఫెన్కూ జర్మనీకి వెళ్ళాడు. హిట్లరుతో సంప్రదించాడు. బ్రిటను రుమేనియాకు ఇచ్చిన గ్యారంటీ విషయము తెలియచేశాడు. బ్రిటనుకు తిరిగి అట్టిహామీ రుమేనియా ఇవ్వకూడదని హిట్లరు తెలియచేశాడు. రుమేనియాతో ఈ మధ్య చేసుకొన్న వర్తకపు ఒడంబడికను వెంటనే అమలు జరుపడానికి ఆరంభించాలన్నాడు. 15 మంది పరిశ్రమాధిపతులుగల రెండు జర్మను రాయబార వర్గములు రుమేనియాకు అప్పుడే బయలుదేరాయి. జర్మనీలో మిలటరీ మోటారు రోడ్డుల నిర్మాణములో నిపుణుడు టాడ్, అచ్చటకూడ అట్టి రోడ్డుల రుమేనియాకు బయలుదేరాడు. రుమేనియాకూడ జర్మనీకి అప్పుడే కిరసనాయిల్, పెట్రోలువచ్చు స్థలాన్ని చూపింది, రష్యాలో కలిస్తే, జర్మనీతో కలసినదానికన్న ఎక్కువ నష్టము వస్తుందని హిట్లరు బోధన రుమేనియా ధనిక జమీందారీ ప్రభుత్వానికి మనస్సునకు నాటింది. గఫెన్కూ, హిట్లరుతో సంప్రదింపులు ముగించిన పిమ్మట ఈ సంప్రదింపుల వల్ల జర్మనీకి, రుమేనియాకు రెంటికీ లాభము కలుగుతుందని ప్రకటించాడు.

హంగరీ యుగోస్లేవియాల మధ్యనున్న తగాదాతీర్చి ఆ రెంటిని ఇటలీ జర్మనులతో మరింత దగ్గర సంబంధము కలిగి యుండేటట్లు చేయడానికి కూడ జర్మనీ ఇటలీలు కృషిచేస్తూ ఉన్నాయి. హంగేరియా విదేశాంగ మంత్రి సియానోను కలసి మాట్లాడాడు ఆ పిదప యుగోస్లేవియా విదేశాంగ మంత్రి సియానోను కలసి సంప్రదింపులు సాగించాడు. వీని ఫలితముగా తేలిన విషయాలు:

యుగోస్లేవియాకు గత ప్రపంచ యుద్ధానంతరము హంగరీ నుండి వచ్చిన భూభాగాన్ని తిరిగి హంగరీఅడుగదట; కాని యుగోస్లేవియా ఈక్రింది సౌకర్యాలు కలిగించాలి. (1) (హంగరీ దేశమునుండి ఇటలీకి బాల్కను రాజ్యాలకు యుగోస్లేవియా గుండా వెళ్ల సామానులకు ప్రత్యేక వసతులు, రేటులు ఉండాలి. (2) హంగరీ మైనారటీకి యుగోస్లేవియాలోను, రుమేనియాలోను ప్రత్యేక సౌకర్యాలు కల్గించాలి. యుగోస్లోవియా కమ్యూనిస్టు వ్యతిరేకపు ఒడంబడికను అంగీకరించాలనీ,ఇటలీ, జర్మను నాయకత్వము క్రింద తన సైన్యాన్ని పునర్నిర్మించాలనీ, ఇటలీతో వర్తకపు ఒడంబడికను చేసుకోవాలనీ సూచించబడింది. దీనికి ప్రతిఫలముగా హంగరీ తన భూభాగాలను తిరిగి అడుగకుండా చేస్తామనీ, యుగోస్లోవియా సరకులకు ఆడ్రియాటిక్ సముద్రములోని ట్రీస్టీ రేవు పట్టణములో స్వేచ్ఛా వాణిజ్య రేవును కల్గిస్తామనీ, ఇటలీ, జర్మనులు దానిపై దాడి వెడలమని అభయ మిస్తామని తెలియజేసారు. సియానోతో సంప్రదింపులు పూర్తి అయినపిదప యుగోస్లోవియా విదేశాంగమంత్రి ఒక ప్రకటన చేసాడు:- జర్మనీతోను, ఇటలీతోను ఆర్థికంగాను రాజకీయంగాను కలసిపనిచేయడానికి అంగీకారము కుదిరింది, డాన్యూబ్ నదీతీరాన ఉన్న రాజ్యాలలో, అంటే బాల్కను రాజ్యాలలో శాంతిని, పరిస్థితులను స్థిమితముగా నుంచుటకు ప్రయత్నాలు చేయాలనికూడ అంగీకారము కుదిరింది. హంగరీతో సౌమ్యపరిస్థితు లేర్పడడానికి అవకాశము కలిగింది." దీనినిబట్టి యుగోస్లోవియా పూర్తిగా ఇటలీ, జర్మనీల షరతులను అంగీకరించినదన్నమాట. ఇంకను మరేమీ సందేహము లేకుండుటకు హంగరీ, యుగోస్లోవియా విదేశాంగ మంత్రులను బెర్లినులకు వచ్చి తన్ను కలుసుకొనమని హిట్లరు కబురంపించాడు.

కేవలము సంప్రదింపులతోనే ఆగలేదు. పోలెండులో జర్మనులను బాధలు పెట్టుతున్నారనే పత్రిక ప్రచారము ఎక్కువయింది. త్వరలో డాన్జిగు జర్మనుచేతికి వస్తుందని డాన్జిగు పౌరులు అనుకుంటున్నారు. అది సాధ్యము కాదని పోలెండు అధికారులు బింకాలు కొట్టుతూవున్న ఏమి సంభవిస్తుందో అన్నభయంతో రోజుకు 40 వేల సవరలు ఖర్చవుతూన్న సైన్యానంతటినీ ఆయత్తము చేసుకొని ఉంది.

స్పానిషు మొరాకోలో జర్మనీ ఇటలీ సైన్యాలు పంపబడ్డాయి. అచ్చటనుండి టాంజియరును ఆక్రమించుకోవచ్చు. జిబ్రాల్టరు చుట్టూ ఫ్రాంకో సేనలు మూగుతున్నాయి. గ్రీసు టర్కీల మధ్యనున్న డొడకనీస్ దీవులను ఇటలీ సైన్యాలతో నింపుతూ ఉంది.

టర్కీకి ఈ ప్రయత్నాలవలన సందేహాలు ఎక్కువయ్యాయి, అందుచే రష్యాతో ఒడంబడికకు రావలసినదిగ బ్రిటిషు ప్రభుత్వముమీద ఒత్తిడితెస్తూవుంది. గ్రీసు తన మైత్రిని పెంపొందించుకుంటూ ఉంది. డార్డినెల్సు జలసంధిలోను బోస్ఫరసు సముద్రములోను సంరక్షణపు ఏటాట్లు చేస్తూఉంది.

కాని బ్రిటిషు ప్రభుత్వము తన గూడుపుఠాణీని మానుకోలేదు, బ్రిటిషు వర్తకపు నౌకలను బ్రిటిషు ధనికులు జర్మనీకి అమ్ముతూ ఉంటే దానిని ఆపడానికి తమకు అధికారములేదంటూ ఉంది. పోలెండు, స్విట్జర్లండు, డెన్మార్కులకు సహాయము చేయాల్సిన ఒడంబడికలు బ్రిటనుకు ఏమీ లేవన్నాడు చాంబర్లేను, అలా లేకపోయినా వానిస్వాతంత్ర్యమును కాపాడుటలో బ్రిటనుకు పూర్తిశ్రద్ధయట.

విదేశాంగమంత్రి హాలిఫాక్సు కూడ ప్రభువుల సభలో ఒక ప్రకటన చేశాడు. "జర్మనీని చుట్టుముట్టడి వేయుట తమ ఉద్దేశముకాదు. రష్యాతో దీర్ఘచర్చలు సాగుతూ ఉన్నాయి. తాము ఏర్పాటు చేస్తూ ఉన్నది దాడులు ఆక్రమణలకు బదులు శాంతితో మార్పులుతేవడానికే."

"కాబట్టే ఆంగ్లో సోవియటు ఒడంబడికను జర్మనీ సహించదు. ఇట్టి ఒడంబడిక చేసుకుంటే జర్మనీ శాంతి సంప్రదింపులకు ఒప్పుకోదు. అందుచే ఒకవేళ ఆంగ్లో-సోవియటు ఒడంబడిక కుదిరినా, 28 వ తేదిన హిట్లరు తన ఉపన్యాసము ముగించువరకు ఒడంబడికను వెల్లడించరు." అని డెయిలీ టెలిగ్రాపు పత్రికా విలేఖరి వ్రాశాడు.

జర్మనీకి కోపము కలిగించకుండా ఉండాలనీ దానితో ఇంకనూ రాజీలు, ఒడంబడిలు చేసుకోవాలని ఇంగ్లండు ప్రభుత్వము ప్రయత్నిస్తుంది. రష్యాతో ఒడంబడికను చేసుకోడానికి నిరాకరిస్తుంది. జర్మనీతో ఒడంబడికను కుదుర్చుకోడానికే కాబోలు తిరిగి జర్మనీకి తన రాయబారిని హెండర్సనును పంపించింది.

కాని ఈయుద్ధ వాతావరణమును అవకాశముగా తీసుకొని, ఫ్రాంసు ఇంగ్లండులలో ఫాసిస్టు వాతావరణము, ఫాసిస్టు పరిపాలన ఆరంభిస్తున్నారు. ఇంగ్లండులో యుద్ధనావలను ఎక్కువగా చేయడానికి పూనుకున్నారు. యుద్ధ పరిశ్రమలకు, యుద్ధానికి కావలసిన సామగ్రిని సరఫరా చేయుటకు సంపూర్ణాధికారాలిస్తూ డాక్టరు బర్గిన్‌ను సప్లయి (సరఫరా) మంత్రిగా నియమించారు. దేశములో నిర్బంధ సైనిక శిక్షణను కూడ ఏర్పరచుటకు కాబినెట్ (మంత్రి వర్గము) ఆలోచిస్తూఉంది. కాని నిజంగా బ్రిటిషు ప్రభుత్వము జర్మనీకి వ్యతిరేకంగా పోరాడుటకు ఇష్టపడుటలేదనుటకు, తమ కన్సర్వేటివుపార్టీలో చాల మితవాదియైన చర్చిలునుకూడ, అతనికి యుద్ధవిషయాలలో ఎక్కువ నిపుణత ఉన్నప్పటికీ, బర్గిను నియామకమువల్ల ఏర్పడిన క్రొత్త కాబినెట్టులో కూడ తీసుకోలేదు. చర్చిలు జర్మనీతో యుద్ధానికి పూనుకుంటాడని, చర్చిలును కాబినెట్టులోకి తీసుకుంటే హిట్లరు మండిపడతాడని, చాంబర్లేను ఆతనిని తీసుకోలేదు.

ఫ్రాంసులో కూడ డిక్రీలు వెనుక డిక్రీలు మంత్రివర్గము ప్రకటిస్తూ ఉంది. క్రొత్త డిక్రీలవలన 1700 కోట్ల ఫ్రాంకులవరకు పన్ను వేసింది. ఆయుధముల అమ్మకము మీద నూటికి ఒక ఫ్రాంకువంతున పన్ను వేసింది. కాని, మిగిలిన వస్తువులన్నిటిపైన అరఫ్రాంకు వేసింది. కార్మికులు ప్రతి పరిశ్రమలోను మునుపటివలె 40 గంటలుగాక 45 గంటలు వారానికి పనిచేయాలని శాసించింది. నిరుద్యోగులకు పనికల్గిస్తూ ఉన్న కట్టడముల మీద, రోడ్లమీద తక్కువ డబ్బు వినియోగించడానికి నిశ్చయించింది.

ఇంగ్లండు, ఫ్రాంసులలో యుద్ధ వాతావరణమును అవకాశమును తీసుకొని, ప్రస్తుతమున్న ధనిక ప్రభుత్వాలు పౌరసత్వ హక్కులను భంగము చేసి, ఫాసిస్టు పరిపాలనకు దారి తీస్తున్నాయి.

# దివి తాలూకా రైతు మహాసభ

16-4-39 వ తేదీన కాజ గ్రామంలో జరిగిన ఆరవ దివితాలూకా రైతు మహాసభకు శ్రీ పేట బాపయ్యగారు అధ్యక్షత వహిస్తూ ఈ క్రిందివిధంగా ఉపన్యసించిరి.

## అధ్యక్షోపన్యాసం

సోదర సోదరీమణులారా :

భారతదేశపు రైతు తన దుర్భర దారిద్ర్యావస్థనుండి తప్పించుకొని ప్రపంచమునందలి సాటి రైతులలో సమాన ప్రతిపత్తిని సంపాదించవలయునంటే తన కష్టార్జితమును, తాను పండించే పంటను తాననుభవించవలె నంటే, ముందుగా జమీందారుల, కోటీశ్వరుల సహాయ సంపత్తులతో రైతులను పీల్చి పిప్పిచేయుచున్న యీ విదేశ నిరంకుశ ప్రభుత్వమునకు స్వస్తి చెప్పవలె. కాంగ్రెసు స్వాతంత్ర్యమును గోరు భారత ప్రజలందరియొక్క ప్రధాన రాజకీయ సంస్థ.

ప్రజలను స్వాతంత్ర్య పోరాటమునకు తయారుచేసి, అచిరకాలములో భారతదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమును చేకూర్చవలెనని కాంగ్రెసు యెన్నికలలో పాల్గొని 8 రాష్ట్రములలో మంత్రిత్వముల స్వీకరించినది. ఋణ పరిష్కార చట్టము, మద్యపాన నిషేధచట్టము మొదలగు చట్టములొనర్చి ప్రజల దృష్టిని కొంత ఆకర్షించగలిగేరు. ఇంతమాత్రము చేత రైతుల దైనందిన కష్టములు తొలగుటలేదు. రైతు లనుభవించు దుర్భరమైన పన్నులు వెంటనే తగ్గించాలె. గ్రామగ్రామాన క్రయవిక్రయ సంఘాలు స్థాపించాలె. విత్తనముల డిపోలు పెట్టించాలి. బంజరు భూమినంతయు సాగులోనికి తీసుకొనివచ్చి ఆహారోత్పత్తి నధికము చేయించాలె. రైతు సంఘాలను రైతునవంటీరుదళాలను ప్రోత్సాహమొసంగి ప్రజలను సామ్రాజ్యవ్యతిరేక పోరాటానికి తయారు చేయాలె కాని, మన మంత్రులు తమ వాగ్దానాలు మరచిపోయి జమీందారీ రైతులు జమీందారులతో చేయు న్యాయమైన పోరాటాలలో, కార్మికులు శాంతియుతముగా తమ హక్కులకై యజమానులతో చేయుచున్నతగాయిదాలలో, పోలీసులు కల్పించుకొని రైతుల పైనను, కార్మికుల పైనను చేయు లాఠీచార్జీలు, కాల్పులు సమర్థించుచున్నారు. చీరాల, పిడ్డిపలన, కాశీపట్టణ వ్యవహారములు అందరి దృష్టి నాకర్షించుచున్నవి. మనమంతా కాంగ్రెసులో చేరి తద్వారా యీ విధానాన్ని వ్యతిరేకిస్తూ ఆందోళన ప్రారంభించాలి. కాంగ్రెసు మంత్రివర్గము ధైర్యముగ తమ ధర్మము నెరవేర్చేలాగు చూడవలయును.

## ప్రకాశం రిపోర్టు

జమీందారీ రైతుల భాగ్యవశాత్తు ఆనరబుల్ ప్రకాశం పంతులుగారు రివిన్యూ మంత్రిగా రావటము తటస్థించింది. వెంటనే జమీందారీ యంక్వయిరీ కమిటీ యేర్పాటు చేయబడినది. ఈ కమిటీ యెదుట రైతులు తమ కష్టాలన్ని భయమువిడిచి చెప్పుకున్నారు.

ఈ కమిటీ నివేదికతో ప్రకటించిన చిత్తుబిల్లు కొంతవరకు జమీందారీ రైతుల కష్టాలు నివారించగలిగియున్నను, జమీందారీ విధానమును పూర్తిగా రద్దుచేయజాలని యేచట్టము కూడ చిరకాలమునుంచి అమానుషముగ బాధల ననుభవించుచున్న జమీందారీ రైతుల సంతృప్తి పడచజాలని మాట వాస్తవము. అయినప్పటికి ఈ చిత్తుబిల్లు ఆంధ్రరాష్ట్ర రైతు సంఘమువారు కోరిన మార్పులతో సవరింపబడి వెంటనే శాసనరూపము దాల్చి అమలులోకి రావలయునని ఆతాత్పురతతో జమీందారీ రైతులందరు యెదురుజూచుచున్నారు. ఈ సంధి కాలములో జమీందారులు రైతులను అవకాశమున్నంతవరకు కోర్టుల కెక్కించి యిబ్బందుల పాలుజేయుచున్నారు. ప్రతి చిన్న వ్యవహారమునకు ఉద్యోగస్థులచేత 144, 107 సెక్షనులు ప్రయోగింప జేయుచున్నారు. అరణ్యము లన్నియు తమ చుట్టాలకు, స్నేహితులకు పట్టాలకొసంగి రైతులకు భవిష్యత్తున అటవీ సౌకర్యముల ననుభవింపడానికి అవకాశమే లేకుండ జేయుచున్నారు. ఈ మధ్య ఒకరిద్దరు జమీందరులు అడవులను నరికించి గ్రామ సాముదాయిక హక్కులకు భంగము కలుగ జేయుచున్నారని రైతులు కోర్టులకుపోతే అట్లు చేయుటకు వీలులేకుండ కోర్టులు యింజెక్షనులు జారీచేసియుండుట మిక్కిలి సంతోషదాయకము ఏగ్రామములోనైన జమీందారులు సాముదాయక హక్కులుగలిగిన అడవులను నరికించుట, నజరానాలు తీసికొని పట్టాల కొసంగుట వగయిరా నష్టకరమయిన పనులు చేయుచున్నయెడల, కోర్టులో పిటీషనుపెట్టి యింజక్షన్ కోరవలయును.

## క్రొత్తగా ఆయకట్టులో చేర్చబడ్డ భూములు.

1935 సం॥లో క్రొత్తగా యీ తాలూకాలో సుమారు 70 వేల యకరముల భూమి ఆయకట్టులో చేర్చబడినది. ఆ భూములను ఆయకట్టులో చేర్చినందుకుగాను యకరానికి 25 రూపాయలు రుసుము చెల్లించవలెనని ప్రభుత్వము నిర్ణయించినారు. పెట్టుబడిమీద సంవత్సరానికి నూటికి ఆరురూపాయలు వడ్డీగిట్టుచో ప్రభుత్వమువారు యిరిగేషను వసతుల నేర్పరుపవలెనను సూత్రము ననుసరించి కృష్ణా యిరిగేషను విధానము నిర్ణయింపబడినది. అట్టిచో యే డెల్టాలోనూ గిట్టనంత హెచ్చుగా నూటికి 18 రూపాయలు వడ్డీ ఈడెల్టాలో గిట్టుచుండగా యింకనూ ఆయకట్టు రుసుము వసూలుచేయ జూచుట అధర్మము. ప్రభుత్వ నిర్ణయములకే వ్యతిరేకము. ఆయకట్టు రుసుము సమర్థించుచూ 1938—39 మదరాసు బడ్జెటు చర్చసందర్భమున రెవిన్యూ మంత్రిగారీ కారణముల తెల్పిరి (1) ప్రభుత్వము వారు యీ భూములకు క్రొత్తవసతి నేర్పరచుట (2) అట్టి సదుపాయమువల్ల భూముల ధరలు హెచ్చుట (3) ఈ వసతిలేని భూములకన్న యీ భూములు యెక్కువ ఫలప్రదములగుట ఇందుకు మన జవాబులు (1) ప్రభుత్వమువారు క్రొత్తవసతుల నేర్పరచినందులకుగాను నీటి తీరువ ప్రత్యేకం వసూలు చేసుకొనుచున్నందున వారికి ప్రతిఫలము ముట్టుచున్నది (2, 3) ఈ సదుపాయమువల్ల తాత్కాలికముగా భూముల ధరలు హెచ్చిననూ నూతన పద్ధతులపై బావినీటి ద్వారా వ్యవసాయము చేసుకొను మెరక భూములనుండి యీ భూముల నుండి కన్న హెచ్చు ఆదాయమురాగలదు ఇదివరలో పాతడెల్టాలోని గ్రామములలో చాలచోట్ల ప్రస్తుతము పల్లం భూములకన్న మెరక భూముల నుండియే ఆదాయము హెచ్చు వచ్చుచుండుటయు, మెరకభూముల ధరలుకూడ పల్లం భూముల ధరలకు తగ్గకయుండుటయు మనము గమనించుచునే యున్నాము. అదియునుగాక నీటివసతి గల్గినంతనే భూమిధర హెచ్చదు. యకరానికి 100 నుండి 200 వరకు భూముల స్థితినిబట్టి రైతు ఖర్చుపెట్టిననేగాని పల్లంపైరు ఫలించదు. మొదటి రెండుమూడు సంవత్సరముల పంట యెరువుకు కూలికే సరిపోదు. కొన్ని నిస్సారమైన భూములు ప్రతి యేటా యెరువు వేయనిచో యేమిన్ని ఫలించవు. ఇతర యే డెల్టాలోనూ లేని యీరుసుము కృష్ణా గోదావరి డెల్టా భూములకు మాత్రమే విధించుట అన్యాయము. ఈ రుసుమును తీసివేయవలసినదిగా గత మూడు సంవత్సరములనుండి రైతు సంఘములు, రైతు మహాసభలు తీర్మానముల ద్వారానూ విజ్ఞప్తులద్వారాను ప్రభుత్వమువారికి విన్నవించు చుండిననూ, ప్రభుత్వమువారెట్టి ఉత్తరువులనూ జారీచేయలేదు. ప్రస్తుతమున్న వుత్తరువుల ప్రకారం జిల్లా రైతు సంఘం ద్వారా కొందరు బీదరైతులు రుసుము తీసివేయవలసినదిగా పెట్టుకున్న అర్జీలకు కూడ జవాబు లేదు. ఇటీవల ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ కార్యదర్శిగారు ఈ రుసుము చెల్లించుటకు 1940 మార్చి ఆఖరు వరకు వ్యవధి నిచ్చుచు ప్రభుత్వమువారు ఉత్తరువు లిచ్చినారని పత్రికలలో ప్రకటించినారు.

ఈ ఉత్తరువు రైతులను తృప్తిపరుపజాలదు. ఈ అన్యాయపు రుసుమును వెంటనే తీసివేయాలి.

ఈక్రొత్త పల్లం భూములకు జరిగిన రెండవ అన్యాయము వీటికి నీరు నవంబరు 10 వ తేదీవరకే యిచ్చెదమనుట. నవంబరు 10 వ తేది తర్వాత నీరు అవసరములేని వరిపైరులు వర్షములుండగానే కోతకు వచ్చునుగాన అట్టి పైరులపంట రైతులచేతికి రాదు. వర్షములకు పనమీదనే తడిసి చెడిపోవును. జనుము. మినుము వగైరా రెండవపంటకూడ వేసుకొన వీలుండదు. వేసిననూ మొలకలెత్తగానే వర్షములకు చచ్చిపోవును. కాన నవంబరు ఆఖరు వరకైననూ నీరు సప్లయి కావలెను. ఈవిషయమును గురించికూడ గత మూడు సంవత్సరములనుండి రైతులు సంఘముల ద్వారానూ, సభలద్వారాను, విజ్ఞప్తులద్వారాను ప్రభుత్వమును కోరుచున్ననూ యింకనూ యెట్టి ఉత్తర్వులు రాలేదు.

మూడవ అన్యాయం మురుగు వసతులు లేకపోవుట. ఆయకట్టు రుసుము, నవంబరు 10 వరకే నీరు—వీనిని గురించి కడపటి ఉత్తరువులు రాకపోవుటచే ఆయకట్టులో చేర్చబడ్డ సుమారు 50000 యకరములు ఇంకనూ పల్లం సాగుకు తేబడలేదు. కాని ఆగస్టు, సెప్టెంబరులలోని విపరీత వర్షములవల్ల, మురుగు సౌకర్యములు లేకపోవుటచే యీస్టుబ్యాంకు కాలువ నీరు, వర్షపునీరు ఏకమై మెరక పైరులను చెడగొట్టుచున్నది. గత ఆగస్టునెలలో ఈ తాలూకాలోని వేరుశనగ, నువ్వు, మొక్కజొన్న వగైరా మెట్టపైరులు వర్షాధిక్యమువల్లనూ యీస్టు బ్యాంకు కాలువ నీటివల్లనూ మురిగిపోయి ప్రతిఫల మివ్వనట్లు మీ తాలూకా రైతు సంఘమువారు జిల్లా సంఘమువారికి తెలిపినారు. ప్రభుత్వమువారు మురుగు వసతుల నేర్పరుపవలెను.

ఈస్టుబ్యాంకు కాలువక్రింద మొత్తం క్రొత్తగా ఆయకట్టులో చేర్చబడిన 80000 యకరములలో యీ ఫసలీలో సుమారు 20000 యకరములు మాత్రమే పల్లం సాగు చేయబడిననూ వరుసగా పదిరోజులు వర్షములు లేనపుడు భూములకు వలయు నీరు సప్లయి కాలేదు. అట్టిచో మొత్తం ఆయకట్టు సాగు కావలసినచో కృష్ణానది నుండి హెచ్చునీరు సప్లయి చేసే మార్గము ప్రభుత్వమువారు వెంటనే ఆలోచించాలి.

## తీర్మానములు.

1. చల్లపల్లి ఎస్టేటులోని కృష్ణలంక గ్రామాలలో రైతుభూములు నదీ ప్రవాహమువల్ల కోయబడి తిరిగి సదరు ప్రదేశములలో భూమి తేలినపుడు పూర్వపు రైతునకు సదరు భూమిని స్వాధీనముకాకుండా ఎస్టేటువారు ఆక్రమించుకొని సొంతకమతము అనే పేరుతో తిరిగి రైతులకు హెచ్చుకవుళ్ళకు యిచ్చుచున్నారు. ఇందుచేత సదరు లంక గ్రామాలలోని వేలకొలది రైతులు నానాటభూములుపోయి నిరుపేదలైయున్నారు. పూర్వము 1854 సం॥ము ప్రాంతములలో జరిగిన ప్రభుత్వపు. సర్వేవల్ల అప్పటి భూమియెంతో తేలగలదు.

మద్రాసు ప్రభుత్వమువారు చేయబోవు ఎస్టేట్సు లెనెన్సీల్యాండు రెవిన్యూ బిల్లులో సదరు లంకభూములు పూర్వపురైతులకే చెందునట్లు అవకాశమును కల్గించవలెనని యీసభవారు మద్రాసు ప్రభుత్వమును శాసనసభ్యులను కోరుచున్నారు.

2. దివితాలూకాలోని బొబ్బర్లంక, కోసూరివారిపాలెం వగైరా గ్రామాలలోని రైత్వారీలంక భూములు నదీపాతమైనను స్థానికోద్యోగులు పన్నులు వసూలుచేయుటయేగాక సదరు లంకలు తేలినప్పుడుకూడా ఆయా భూముల స్వంతదార్లగు రైతులను స్వాధీనపర్చుకొనకుండ ఆటంకపర్చుచు భూములు యింకా పెరిగితేనేగాని వ్యవసాయమునకు పనికిరావని చెప్పుచు అట్టి భూములనే యితరులకు కౌలుకిచ్చుచున్నారు. ఈ అన్యాయమును ప్రభుత్వము విచారించి వెంటనే రైతులకు సదరుభూములను స్వాధీనపర్చవలెననియు భూమి తిరిగి తేలిన తరువాత రైతులకు స్వాధీనముకాకుండ యితరులకు ప్రభుత్వమువారు కౌలుకిచ్చి రాబట్టిన సొమ్మును రైతుల కిప్పించవలసినదిగా యీ సభవారు ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

3. ఈస్టుబాంకు కెనాలుకు పాతకట్టకు మధ్యనున్నభూములు, పల్లపుసాగుకు అంగీకరింపబడక మెరకశేరీగానే యుంచబడినవి. ఆ అభూములు రెండు కట్టలకు మధ్యనుండుట వలన మురుగుపోవుటకు వీలుగాలేకను కాల్వలో నున్ననీరు అభూములకన్న ఎత్తులో మంచుటచేతను సదరు భూములు వురకవేసి మెట్టపైర్ల కేమాత్రము అనుకూలముగ లేవు. అందుచే ఆ భూములు అయకట్టులో జేర్పించగలందులకు ప్రభుత్వమువార్ని యీ సభవారు కోరుచున్నారు.

4. ప్రస్తుతమున్న ఎస్టేటు ల్యాండు అక్టు ప్రకారముగూడ మెర్కా భూములు పల్లపు భూములుగ సాగుచేయబడ్డప్పుడు కొన్ని షరతులమీదనే తప్ప పల్లపు సాగుచేయబడినదనే కారణము వలననే అదివరకున్న మెట్టరేటును అధికము చేయుటకు జమీందారుకు హక్కు లేదు. ఎస్టేటు ల్యాండు అక్టు ప్రకారము ఏ పరిస్థితులలో శిస్తులు హెచ్చింపవలెనో ఆ పరిస్థితులు మన ఎస్టేటులో లేకపోయినప్పటికిని, తాలూకాలో క్రొత్త మాగాణీల కన్నిటికి హెచ్చు శిస్తులు విధించబడి వసూలు చేయబడుచున్నవి. ఇది చాలా చట్ట వ్యతిరేకమగుటచే ఇట్టి అక్రమ శిస్తువసూలును చల్లపల్లి ఎస్టేటువారు వెంటనే మాన్పించవలసినదిగా కోరడమైనది.

# త్వరలో విడుదలగానున్నది!

రామగోపాల్ పిక్చర్సువారి సినిమా కళాసృష్టి!

# "పాశుపతాస్త్రము"

తెలుగు దేశమందలి ప్రకృతి రామణీయకము:
ప్రసిద్ధ భారత సాంకేతిక నిపుణుల ప్రతిభ:
ప్రాచీనాధునిక నృత్య గీతాదులు:
కళాయుతములైన అలంకారములు:
ప్రతిష్ఠగాంచిన నటులు: గల చిత్రము 'పాశుపతాస్త్రము'




స్టూడియో:
ఆంధ్రసినిటోను

సాంకేతిక ప్రవీణులు:

ఛాయాగ్రహణం:
దేవీజీ

శబ్దగ్రహణం:
ముఖర్జీ

కవి:
కాళిదాసు

సంగీతము:
గోపాల్ సింగ్

డిస్ట్రిబ్యూటర్సు:—
సరస్వతీ టాకీస్ లిమిటెడ్, బెజవాడ.

గ్రామఫోను ప్రపంచమందలి మధురగానము 'పాశుపతాస్త్రము' రికార్డులు:—
సన్ రికార్డు కంపెనీ వారివి.

